నేడే చూడండి!





భాస్కర్ ప్రొడక్షన్స్ వారి....

# పార్వతీ కల్యాణం





దర్శకుడు: భాస్కర రావు.

చిత్రం SARMA T.V.S

CHITRALEKHA

డిస్ట్రిబ్యూటర్స్:— ఆంధ్ర: పరమేశ్వరీ ఫిలిమ్స్ ప్రయివేట్ లిమిటెడ్—విజయవాడ.



[గంధర్వ కన్యను ప్రేమించి మోస పోయిన ఒక వర్తకుడి కథ విని హాతిం ధైర్యం చెబుతూ - ఆ కన్యను వెతికి అప్పగిస్తానని హామీ యిచ్చి బయలు దేరాడు. దార్లో వంటిపైని బట్టలేక దిగంబరుడిగా యేడుస్తున్న సిపాయిని చూచి విచారించాడు. మాంత్రికుడి కూతుర్ని పెళ్లాడేవాడు మూడు ప్రశ్నలకు సరైన జవాబు తేవాలి అని సిపాయి అన్నాడు పరోపకారమే పరమావధిగా గలిగిన హాతింతాయి, సమాధానం కోసం నడచాడు. అలా వెళ్లగా, ఒక రాక్షసుడు పెట్టే బాధలకి తాళక, ఆ నగరవాసులు హాతింతాయి సలహా అడిగారు. మంచి పన్నాగం పన్ని ఆ రాక్షసుణ్ని యిట్టే హత మార్చాడు - ఇక చదవండి.]

దాంట్లో వున్న రక్కసు ముళ్ళన్నీ గుచ్చుకుని ఆ రాక్షసుడి వళ్లంతా రక్తాలు కారింది. అదే సమయం గదా అని హాతిం అమాంతంగా వాడి పైబడి కళ్ల పైని రెండు గ్రుద్దులు గ్రుద్దే సరికి రెండు కళ్లూ వూడి పడ్డాయి. మరొక దెబ్బతో వాడు నేలకూలి ప్రాణాలు వదిలాడు. ఈ సంగతిని హాతిం ఆ వూళ్లో వున్న వారందరికీ తెలియజేశాడు. మర్నాడు వారంతా వచ్చి యింకా అనుమానంతో అల్లంత దూరాన నిల్చుని నేల పైని ఒక పెద్ద పర్వతం లాగ పడి వున్న రాక్షసుడి శవాన్ని చూశారు. కానయితే వాడు చచ్చాడంటే యెవ్వరికీ నమ్మకం కుదర లేదు. అలా మూడు రోజుల వరకూ చూస్తూనే వున్నారు అప్పటికి రాక్షసుడి శరీరం కదల్లేదు-మెదల్లేదు. అప్పటికి గాని ఆ వూరి ప్రజలకు ధైర్యం చిక్కలేదు. మెల్లిగా అడుగు లేసుకుంటూ ఆ శవం దగ్గర పరీక్షగా చూశారు. శవమంతా రక్తంలో తడిసి ముద్దయి పోయివుంది రాబందులూ, గ్రద్దలూ గుంపులు గుంపులుగా వచ్చి సంతుష్టిగా రాక్షసుడి మాంసం తింటున్నాయి. అప్పుడు ప్రజలంతా ఆ శవానికి తాడు కట్టి లాగి ప్రక్కనే మండుతున్న అగ్గిలో పడవేశారు. అది రెండు రోజుల పాటు కాలిన మీదట బూడిదై పోయింది.

హాతిం సాహసాన్ని ఆ వూరి ప్రజలంతా వేనోళ్ల పొగడి అతణ్ని తమ రాజుగారి దగ్గరకు తీసుకు పోయారు. రాజుగారతణ్ని ఎంతో గొప్పగా సత్కరించి రాజదండం ఒక దాన్ని బహూకరించారు. ఆ దండాన్ని చేత్తో నిటారుగా పట్టుకుంటే యెలాంటి విషబాధ కూడా వుండదు. యెవరయినా మంత్ర తంత్రాలు ప్రయోగించినప్పుడు ఆ దండాన్ని చుట్టూ ఒకసారి తిప్పితే చాలు, అవన్నీ పటాపంచలయి పారిపోతాయి. పొంగి పొరలి ప్రవహించే నదిలో దాన్ని ముంచితే ఒక పడవ లాగ పని చేస్తుంది. ఇలాంటి మహత్యాలు గలిగిన దండాన్ని అతనికి యెంతో ఆనందంగా యిచ్చారు. అంతే కాదు. దాంతో బాటు రాసులు రాసులుగా మణి మాణిక్యాలు, రత్నాలు, వజ్రాలు, వైఢూర్యాలు, అన్ని

రచన: "బాబ్జీ"



రంగుల పాముల విషాన్నీ హరించే ఒక ముత్యం, లెక్కలేనన్ని బంగారు కాసులు బహూకరించారు. హాతిం ఆ సంపద నంతటినీ అక్కడుండే పేద వారందరికీ పంచిపెట్టి రాజు గారి దగ్గర, ప్రజల దగ్గర సెలవు పుచ్చుకుని తన పని మీద అక్కణ్నుంచి మళ్లీ బయలుదేరాడు.

అలా కొంత దూరం వెళ్లేసరికి రెండు గట్లను తెంచుకుని జరజర మనుకుంటూ జోరీపాతంగా లోతయిన నల్లటి నీటితో ప్రవహించే పెద్ద నది ఒకటికనిపించింది. అయినా హాతిం చేతిలో రాజదండం వున్నదిగా మరి!- అందుకని దాన్ని నదిలో వేసే సరి కది పెద్ద నావగా మారిపోయింది. హాతిం దాంట్లో కూర్చుని నదిని దాటుతూ వుండగా, మధ్యదోవలో జలరాకసు డొకడు గభాల్న పైకొచ్చి ఆ నావనూ - హాతింనీ దభేల్న నీటిలో ముంచి వేశాడు. కొంత సేపయేక హాతిం కళ్లు తెరచి చూశాడు. తను నీట్లో లేడు-నేల పైని నిల్చున్నాడు. తన యెదురుగా ఆ రాకసుడు చేతులు జోడించుకుని ఎంతో విధేయుడుగా నిలబడ్డాడు.

హాతిం కదంతా అగమ్యాగోచర మనిపించింది. "నన్నిక్కడికి తీసుకొచ్చావేం ?" అంటూ అడిగాడు.

అందుకా రాకసుడు,-"అయ్యా, మొదట్లో నేనే యీ రాజ్యానికి రాజుని. ఇప్పు డింకొక రాజు నా దగ్గర నుంచి దీన్ని లాక్కున్నాడు.



మా యిద్దరికీ న్యాయమైన తీర్పు చెప్పమనేందుకే నిన్నిక్కడికి తీసుకొచ్చాను" అన్నాడు.

అంతలో యిప్పుడు రాజ్యమేలుతున్న బలవంతుడైన రాజు కూడా అక్కడి కొచ్చాడు. అది కనిపెట్టి యింత వరకూ ఫిర్యాదు చేసిన రాకసుడు తన కాళ్లకు బుద్ధి చెప్పి అక్కణ్నుంచి పారిపోయాడు. అప్పుడు హాతిం ఆ బలవంతుడైన రాజు కెదురుగా వెళ్లి చేత్తో రాజదండం పట్టుకుని భగవంతుణ్ని స్మరించుకున్నాడు. అందువల్ల ఆ ప్రభావానికి రాకసుడి ఆర్భాటం తగ్గి పోయింది. "ఓయి రాకసోత్తమా, నీలాంటి పరాక్రమవంతుడు ఇతరుల రాజ్యాన్ని అపహరించడం అన్యాయం-నీచమైన పని" అన్నాడు హాతిం ధైర్యంగా;-మామూలు మానవుడైన హాతిం ఇంత నిర్ల





క్ష్యంగా మాట్లాడ్తాడా అని ఆ రాక్షస రాజు మండి పడుతూ అమాంతంగా హాతిం పైకి వురికాడు. అయినా హాతిం అదర లేదు - బెదర లేదు. తన చేతిలో నున్న రాజదండంతో ఒక్క టి తగిలించే సరికి అంతటి రాక్షసుడూ "హా హా" మనుకుంటూ చచ్చి వూరుకున్నాడు. అదివరకు భయంతో పారిపోయిన రాక్షసుడు మళ్లీ తిరిగి వచ్చి హాతిం చేసిన వుపకారానికి తన నంతోషాన్ని తెలియజేసి, గౌరవ మర్యాదలతో అతణ్ని నది అవతలి ఒడ్డుకి తిగబెట్టాడు.

హాతిం ఆ రాక్షసుడి దగ్గర నుంచి బయలుదేరి ఒక కీకారణ్యానికి చేరుకున్నాడు. అప్పటికే చీకటి పడింది. అందుకని కాస్త సేద తీర్చుకుందామని అతనొక చెట్టు క్రిందని పడు



కున్నాడు. అదేమిటో విచిత్రం మరి, ఆ చెట్టు మీదనే పరో పక్షుల జోడు కాపుర ముంటున్నాయి.

మగ పక్షి హాతింని చూసి ఆడపక్షితో అన్నది గదా,-"ప్రేయసీ, ఇతరుల కష్టాన్ని పోగొట్టేందుకు తన జీవితాన్నే అంకితం చేసిన మహానుభావుడు హాతిం. మన చెట్టు క్రింద విశ్రాంతి తీసుకుంటున్నారు. ఆయన దర్శనం చేసుకుని మన జన్మ తరింప జేసుకునే సదవకాశం మన కిప్పుడు దొరికింది. మన మెంత ధన్యులం!-పద వెళ్దాం".

అందుకు ఆడపక్షి గూడా తలవూపి,- "అవునండీ, ఇతరుల శ్రేయస్సు కోసం యింతగా పాటు పడుతున్న యీ మహాత్ముడు తన కోరికలన్నీ మానుకుని కష్టపడుతున్నప్పుడు ఆయనకి జయ మయేందుకు మన పిల్లలపై మమకారం మాని వాటిని ఆయనకి సమర్పించుకుందాం" అని చెప్పింది.

హాతిం ఆ పరోపక్షి దంపతులు చెప్పుకున్న మాటలన్నీ తెలుసుకున్నాడు వాటి త్యాగాన్ని మెచ్చుకుని పరోపక్షి పిల్లల జతతో బయలుదేరి తిరిగి వచ్చి తన యువక మిత్రుడి కందించాడు. ఆ యువకుడు వాటిని తీసుకెళ్లి మాంత్రికుడి కిచ్చే సరికి, వాడు సంతోషంతో ఉప్పొంగి పోయాడు. మళ్లీ ఆ యువకుడు మాంత్రికు డడిగిన రెండవ ప్రశ్న తీసుకొచ్చాడు. ఏమిటదీ?-ఎఱ్ఱనాగుపాముపడగలో నున్న రత్నాన్ని తీసుకు రావాలి.





అందుకోసం హాతిం బయలుదేరి మూడు రోజుల వరకూ ముక్కుకి సూటిగా యేక బిగిని నడిచి వెళ్లాడు. నాలుగో రోజున ఒక అరణ్యంలో అతను యేడు రంగుల నాగు పాము నొకదాన్ని చూశాడు. హాతిం నిర్ఘాంత పోయి అదెక్కడుంటుందో యెలాగయినా కనుక్కోవాలని దాని వెంట పడ్డాడు. సాయింకాల మయే సరి కా సర్పం ఒక పెద్ద గుహలో దూరింది. హాతిం మరొక్కసారి దాన్ని పరీక్షగా చూసి అక్కడే గుహ వెలుపల కూర్చుండి పోయాడు. కొంత సేపటి కల్లా యెవరో కొంత మంది తమ బంధు మిత్ర పరివారంతో వస్తూ అక్కడ మజిలీ చేశారు. వారు తమతో తెచ్చుకున్న భోజనాన్ని తిని కొంచెం హాతిం కిచ్చి ఆ రాత్రి కక్కడే పడుకున్నారు. సరిగ్గా అర్ధరాత్రయే సరికి ఆ యేడురంగుల పాము గుహలో నుంచి బయటికొచ్చి హాతిం నొక్కణ్ణి మాత్రం మినహాయించి తత్తిమ్మా వాళ్లందర్నీ కరిచి మళ్లీ గుహలోకెళ్లి పోయింది. పాము చేసిన యీ చెడ్డ పనినిచూసి హాతిం కెంతో కష్ట మనిపించింది. తెల్లవారగానే వూళ్లో వున్న జనమంతా వచ్చి తమ తమ బంధువులు చచ్చి పడి వుండడం చూసి గోలు గోలుమని యేడవ సాగారు. అప్పుడు హాతిం యేడు రంగుల పాము చేసిన సంగతి వారందరికీ తెలియ జెప్పాడు. ఆ పామేమిటో, ఎలా వుంటుందో చూడాలని వారంతా అక్కడే నిల్చున్నారు. అంతలో ఆ పాము గుహలో నుంచి గబగబా బయటికొచ్చి గ్రామాధికారిని కరిచి చంపి మళ్లీ గుహలో కెళ్లి పోయింది. మిగతా వారంతా 'కుయ్యో—మొర్రో' మనుకుంటూ 'అయ్యో, ఇక ఒక్క గడియ కూడా యిక్కడుండ కూడదు బాబోయ్' అని బెంబేలెత్తి అక్కణ్ణుంచి పారిపోయారు.





అయితే హాతిం మాత్రం ఆ యేడు రంగుల పాము వెంట బడడం మాత్రం మానలేదు. మర్నాడు సాయింకాలం ఆ పాము ఒక నల్లటి పాముగా మారి ప్రక్కనున్న నగరంలో ప్రవేశించి రాజకుమారుణ్నీ, మంత్రిగారినీ కరిచింది. ఉదయం లేచి చూసేసరికి వారిద్దరూ చచ్చి పడి వున్నారు. ఇక నగరం యావత్తూ వారి చావుకి గోలు గోలుమని దుఃఖించడం మొదలెట్టింది. హాతిం కూడా దుఃఖం ఆపుకో లేక పోయాడు. అయినా ఆ పరమేశ్వరుడి లీలల ముందు నీచమైన మానవుల యంత్ర తంత్రా లేవీ సాగవని ధైర్యం తెచ్చుకున్నాడు. తర్వాత ఆ నల్లటి పాము చటుక్కున పెద్ద సింహంగా మారి పోయింది. దార్లో ఆడుకుంటున్న పసిపిల్ల వా డొకణ్ని అమాంతంగా



నోటితో కరుచుకుని పోయి తన పొట్టను బెట్టుకుంది. తర్వాత అది సింహం రూపులో నుంచి ఒక అందాల కన్యగా మారిపోయి రాజబాటలో అటూ-యిటూ వయ్యారంగా తిరగడం మొదలెట్టింది అదే దారిని యిద్దరు వర్తకులు మ వూరికి తిరిగి వస్తున్నారు. వారిద్దరూ అన్నదమ్ములే!—వారిని చూసి యీ మాయా సుందరి యేకనాథంగా యేడవడం, అరవడం ఆరంభించింది. ఆమె యేడుపు విని వర్తకు లిద్దరూ ఆమె దగ్గరికొచ్చి సంగ తేమిటని అడిగారు. అప్పుడామె దొంగ యేడుపులు నటిస్తూ,-"నా మొగుడు నన్ను మా పుట్టింటి నుంచి వాళ్ల ఇంటికి తీసుకెళ్తున్నాడు. పోయిన రాత్రి యీ పక్కనే యిద్దరం పడుకున్నాం. ఈ వేళ పొద్దున్న లేచి చూసే సరికి మాయమై పోయాడు. ఎంత పిలిచినా పలక లేదు. ఏమయ్యాడో-ఎక్క డున్నాడో-అయ్యో-నా గతేమిటి భగవంతుడా!" అని కంటికీ మంటికీ యేక ధారగా యేడుస్తున్నానని" చెప్పింది.

ఇది విని ఆ వర్తకు లిద్దర్లోనూ పెద్దవాడు ఆమె పైని జాలిపడి,-"అయ్యో, నీ కెవరూ దిక్కు లేరనగానే నా కెంతో యిదిగా వుందమ్మాయీ. నన్ను పెళ్లి చేసుకుందు కొప్పుకున్నా వంటే నిన్ను మా వూరికి తీసుకు పోయి మహారాణీ లాగ వుంచుతా" నన్నాడు.

"మిమ్మల్ని పెళ్లి చేసుకోవడానికి నా కేమీ అభ్యంతరం లేదు గాని నేను పెట్టే మూడు షరతులకూ మీ రొప్పుకోవాలి. ఒకటి-మన పెళ్ళి తర్వాత మీరు మరింకే స్త్రీతోనూ సంబంధం పెట్టుకో గూడదు. రెండు-వంటకీ,





యింటి పనులకీ మరొకర్ని పెట్టుకోవాలి. ఎందుకంటే నేను మీకు చాకిరీ చేసే దాన్ని కాను. మూడు-నా మాట కెదురుండ గూడదు ఈ మూడు షరతులకూ అంగీకరించారంటే మిమ్మల్ని పెళ్లి చేసుకుంటాను" అన్నదామె

"సరే, అలాగే" నని ఒట్టు పెట్టుకున్నాడా వర్తకుడు. ఆమె కూడా అతని చేతిలో చెయ్యి వేసి ఒట్టు పెట్టుకుంది. అత నామెను తన గుర్రంపై కెక్కించుకుని తమ్ముడితో బయలు దేరాడు—

ఇదంతా కళ్ళారా చూస్తున్న హేతింకి యెంతో ఆశ్చర్య మనిపించింది. దీంట్లో యేదో రహస్య ముండి వుంటుందని ఆ గుట్టేమిటో కనుక్కొని తీరాలని అతను కూడా వారి వెంట బడ్డాడు. కొంచెం దూరం వెళ్లే సరి కా కపట స్త్రీ తనకి చాలా దాహంగా వుందని టక్కరి నాటకం గట్టింది. అప్పుడు పెద్దవా డామెని తన తమ్ముడి దగ్గర వుంచి నీరు తీసుకొచ్చేందు కెళ్లాడు. ఆ మాయా సుందరి చిన్నవాడి దగ్గర కొచ్చి తన వన్నెలు చూపిస్తూ, "మి అన్నను పెళ్లి చేసుకున్నా నన్నమాటే గాని నా ప్రేమ అంతా నీ మీదనే సుమీ; అందుక ' అతను లేని యీ సమయం చూసుకుని మన మిద్దరం వేరే దారి బట్టి మరొక దేశానికి లేచి పోదాం పద" అని తొందర జేసింది.

తమ్ముడికి ఆమె మాట లాలకించగానే అపరిమితమైన కోప మొచ్చి పడింది. "ఛీ, ఎలాంటి పాపిష్టి మాటల న్నావు! నువ్వు మా అన్న భార్యవి. నాకు వదినె వవుతావు. వదినె అంటే తల్లితో సమానం. తల్లిలాంటి దాని



విలాంటి పాపపు కార్యాని కొడి గట్టమంటావా? పో" అంటూ గసిరాడు.

ఆమె కెక్కడా లేని కోపం వచ్చింది. పళ్లు పట పటా కొరుకుతూ కళ్ల వెంట చింత నిప్పులు రాలుస్తూ,-" నా మాట కాదంటు న్నావు గదూ! సరే, మి అన్న రాగానే నిన్నేం చేస్తానో చూసుకో" అని వెంటనే తన తల అంతట్నీ విరియ బోసుకుని చీరెని చింపుకుని 'అయ్యయో,' ఎంతపనయిపోయింది దేవుడో," అనుకుంటూ దొంగ యేడుపు రాగాలు ప్రారంభించింది. అంతలో అన్న తన కొత్త పెళ్లి కూతురు కోసం నీళ్లు పట్టుకొచ్చాడు. ఆమె అంత గోలపెట్టి యేడుస్తుంటే చూసి ఆగ్రహం ఆపుకోలేక పోయాడు. ఏమిటి జరి





గిందో చెప్పమని అడిగాడు. ఆమె అదే పనిగా వెక్కి వెక్కి యేడుస్తూ,-"ఇంకేం చెప్పను నాథా ?-మీ తమ్ముడు కళ్ల కావరంతో నన్ను ప్రేమించి, నా మీద పడి బలాత్కరించి నన్ను మానభంగం చేశాడు. నా పరువు మంటలో గలిపాడు. అయ్యో - ఇక నా గతేమవు తుందో!" అని చెప్పింది. ఈ మాటలు విని నిజమే ననుకుని, అన్న గ్రుడ్లురుముతూ మంచి చెడ్డలాలోచించకుండా తమ్ముడి పైని విరు చుకు పడ్డాడు పాపం తమ్ముడెంత చెప్పినా వినిపించుకో లేదు. పరస్త్రీ మాటలే నమ్మాడు గాని స్వంత తమ్ముడి మాటలు నమ్మలేదు. ఇద్దరూ దెబ్బలాటకి దిగారు. ఫలితం మరి కొంత సేపటికే యిద్దరూ రక్తాలు కక్కు కుంటూ మరణించారు.

తర్వాత ఆ స్త్రీ ఒక ముసలివాడిగా మారి పోయింది. ఇదంతా చెట్టుచాటు నుంచి పొంచి చూస్తున్న హాతిం గఖాల్నా ఆ ముసలాయన ముందు కొచ్చి,-"మహాశయా, మీరు మొదట్లో యేడురంగుల సర్పంగా వున్నారు. తర్వాత నల్లని త్రాచుపామయ్యారు. తర్వాతసింహంగా మారారు. ఆ తర్వాత సుందరాంగి అయ్యారు. ఇప్పుడు చూస్తే యిలా మారారు. దీంట్లో వుండే రహస్య మేమిటో కాస్త చెప్తారా ?" అని అడి గాడు. అందుకా ముసలాయన ఇలా అన్నాడు. "నేను కాల యముణ్ని నాయనా. ఏయే ప్రాణులు యేయే సందర్భాలలో ఎందు కోసం మరణం పొందాలని విధి లిఖించడం జరిగిందో, ఆ ప్రకారంగా వాటి ప్రాణాలను తీసుకు పోయేందుకు నే ననేక రకాల అవ తారాలను మార్చవలసి వస్తుంటుంది"—

"అయితే నా ఆయుర్దాయం యెంత?— నాకు చావెలాగ ప్రాప్తిస్తుంది, దయచేసి చెప్పండి" అన్నాడు హాతిం- (ఇంకా వుంది)





[హుస్నభాను అడిగిన నాలుగో ప్రశ్న - "సత్యం చెప్పేవాడు సదా సుఖిస్తాడు" అంటూ అరచే ఆసామీ వృత్తాంతం యేమిటో తెలుసుకు రావడం. హాతిం యధాప్రకారం మళ్లీ బయలు దేరాడు. ఒక చోట పతనికి రక్తపు ఏరు కనిపించింది. దాని వొడ్డున వున్న ఒక చెట్టు కొమ్మలకు యెవరో అందాల సుందరీమణుల తలలు వేళ్లాడుతున్నాయి. వాటి రహస్యం యేమిటో చెప్పమని హాతిం ఒక సన్యాసి నడిగాడు. ఆయన అతణ్ని కళ్లు మూసుకోమన్నాడు ]

హాతిం కళ్లు మూసుకుని మళ్లీ చూసే సరికి తను యెక్కణ్నుంచి బయలుదేరాడో అక్కడే నిల్చున్నట్టు కనిపించింది. ఎదురుగా తలలు వేళ్లాడుతున్న చెట్టు కనిపించింది. యెలాగయినా పెద్ద తలను పట్టుకొని దాన్ని మురపించి, ఆ రహస్య మేమిటో తెలుసుకోవాలనే ఆశ హాతింకి మళ్లీ కలిగింది. అందుకని ఆతనా చెట్టు యెక్కబోయాడు. కాని అంతలోనే పెద్ద తుఫాను గాలి వీచింది. ఆ గాలికి చెట్టు విరిగి క్రింద పడి పోయింది. దాంతో హాతిం దభేల్న దాని క్రిందని పడి పోయాడు. ఎలాగయినా తప్పించుకుని బయట పడాలని అతనెంతో ప్రయత్నించాడు. కాని లాభం లేక పోయింది. రెండు చేతులూ - తల మాత్రం బైటికొచ్చింది. మిగతా శరీరమంతా ఆ చెట్టు క్రిందను చిక్కుకు పోయింది. ఊపిరాడడమే కష్టంగా వుంది. ఇక తన ప్రాణం యిక్కడే పోతుందేమోనని యెంతో పరితపించ సాగాడు. అప్పుడిదివరకు కనిపించిన సన్యాసి మళ్లీ కనిపించి తన జేబిలో నుంచి విభూదిని తీసి ఆ చెట్టు పైకి విసిరి మంత్రించాడు. దాంతో ఆ చెట్టు యధాప్రకారంగా పైకి లేచింది. వెంటనే హాతిం పైకి లేచి ఆయనకు నమస్కరించాడు. "సాధు పుంగవా, ఈ చెట్టు కొమ్మలపై వేళ్లాడుతున్న తల లెవరివో దయచేసి చెప్పండి. వారి స్థితి యిలా కావటానికి కారణ మేమిటి? నాపై దయవుంచి ఈ సంగతి వివరంగా చెప్పండి స్వామీ" అని వేడుకున్నాడు హాతిం.

అప్పుడా సాధువిలా చెప్పాడు,-"ఈ చెట్టు పైని అందరి కన్న యెత్తుగా-అందంగా వున్న తల వుంది చూశావూ, ఆ తల బద్రూకు డనే సత్పురుషుడి కన్య ఫరీదా అనే అందాల సుందరిది. ఆమెకు యవ్వనం రాగానే ఒక యువకుణ్ని ప్రేమించింది. అయితే ఆ సంగతి చాలా రహస్యంగా వుంచింది. ఆఖరికి ఆమె తండ్రికి కూడా తెలియదు. చెలికత్తెలకు మాత్రం తెలుసు. ఈ సంగతి ఆమె తండ్రికి తెలిసిన వెంటనే కోపగించు కున్నాడు. తననిలా మోసగించినందుకు తన కూతుర్నీ, ఆమెని ప్రోత్సహించి నందుకా చెలికత్తెలను యీలా వుండమని శపించి వేశాడు. అందుకే వీరి గతి యిలాగయింది.

రచన : "బాలమిత్ర"





వద్దు నాయనా. ఈ రహస్యానికి కారణ మేమిటో కనుక్కోవాలని వుంటే, నువ్వు చాలా చిక్కుల్లో పడవలసి వుంటుంది. ఇప్పుడా తల తీసుకు రావాలనుకున్నావే! —నీ గతి ఆ క్షణంలో యేమయిందో కాస్తయినా ఆలోచించావా? సమయానికి నేను రాకపోతే యేమయ్యేవాడివి. బాగా ఆలోచించు" అన్నాడు సాధువు.

అయినా హాతిం దైవ నిర్ణయాన్ని తప్పించడాని కెవరికి శక్యం?-ఒకవేళ యీ స్త్రీలతో బాటే నా ప్రాణం కూడా పోవాలని వ్రాసి వుంటే, దాన్నెవరూ తప్పించలేరు గదా!-నాకేమో ఆ పెద్ద యువతి అంటే చాలా ఇష్టంగా వుంది. అందువల్ల యీ మహా కార్యంలో మీరే నాకు తోడునీడగా వుండి సాయపడాలి" అన్నాడు.

అది విని సాధువు తన జోలిలో నుంచి కాస్త విభూదిని తీసి ఆ చెట్టు పైకి విసిరి,- "ఇక నువ్వా చెట్టు యెక్కు - మరేం ఫర్వాలేదు" అని చెప్పి మాయమై పోయాడు.

హాతిం దేవుణ్ని స్మరించుకుని ఆ చెట్టెక్కి ఫరీదా శిరస్సుని ముట్టుకున్నాడు. దాంతో ఇంకేం చెప్పాలి. అతనితలా-మొండెం రెండూ విడిపోయాయి. తల చూస్తే ఫరీదా తల ప్రక్కనే ఆ చెట్టుకి వ్రేళ్లాడ సాగింది. మొండెం యేమో క్రింద నదిలోపడి మునిగి పోయింది.

సూర్యుడస్తమించగానే మామూలుగానే ఆ స్త్రీలంతా చక్కని యువతులై ఆట-పాట

అంతే గాకుండా తన ఇంద్రజాల విద్యతో యీ చెట్టునూ - ఈ నదినీ పుట్టించాడు ఆ బద్రూకుడు ఇక్కణ్నుంచి సరిగ్గా ఒక వెయ్యి యోజనాల దూరాన వున్నాడు. బసరీడ్ అనే పర్వతం పైని తన ఆశ్రమాన్ని నిర్మించుకుని సాధువులందరిలోనూ శ్రేష్ఠుడనిపించుకున్నాడు. ఆయన అక్కడ నుంచి యిక్కడికి రావడానికి అర గడియ కూడా పట్టదు. ఆయన బ్రతికి వున్నంతవరకు వీరందరి గతీ యింతే!"—

అప్పుడు హాతిం ఆతృతగా,-"అయితే నేనా ఫరీదా యువతి తల తీసి క్రిందికి పట్టుకొస్తాను" అన్నాడు.

"అలాంటి పని కెంతమాత్రం పూనుకో



లారంభించారు. హాతిం కూడా వారితో బాటు కేళీ విలాసాలతో సుఖించ సాగాడు. అప్పుడతనికి తనిప్పు డెక్కడున్నా నని గాని, ఇలా యెందుకయానని గాని తలంపేలేదు. నృత్యం-గానం అయేక భోజనాలు సిద్ధమయాయి. పెద్ద యువతి ఫరీదా హాతిం పళ్ళెన్ని స్వయంగా తన ప్రక్కనే పెట్టుకొని వడ్డించింది. ఇద్దరూ యెంతో ఆనందంగా - హాయిగా భోజనం చేశారు.

మళ్లీ తెలతెలవారుతుండగానే తల లన్నీ మొండేల నుంచి విడిపోయి చెట్టు కొమ్మలకి అంటుకుని యథాప్రకారం వేళ్లాడాయి. ఇలాగే కొన్నాళ్ళు గడిచి పోయాయి. తర్వాత ఒకనాడు మళ్లీ యిది వరకటి సాధువు ప్రత్యక్షమై హాతిం శిరస్సు మీద కాస్త విభూది జల్లాడు. వెంటనే అతని తలా - మొండెం రెండూ యేకమయి మామూలు మనిషిగా మారిపోయాడు. హాతిం ఆయనకు నమస్కారం చేసాడు. సాధువతణ్ని ఆశీర్వదించి,- "నీ కోరిక నెరవేరిందా నాయనా?" అని అడిగాడు.

అందుకు హాతిం,-"స్వామీ, మీ కరుణా కటాక్షం వల్లనే నా కోరిక నెరవేరింది. ఆ ఫ
దా నా దానిగా అయేటట్టు ప్రసాది
స్వామీ" అన్నాడు.

"చాలా పెద్ద కోరికే!-ఇది నె
బద్రూకుడు చావాలి. ఇప్పుడు
శక్తి మంత్రాన్ని ఉపదేశిస్తాను.
వుండి దాన్ని పఠించావంటే, నీ
వచ్చినా యిట్టే దాటుకుని రాగల
ఈ మంత్ర దండం తీసుకో. దీన్ని
కుని భగవంతుణ్ని స్మరించావ పఠించడం
మరు క్షణం లోనే ఆ బద్రూకు డు
తానికి పోయి చేరుకుంటావు' అనిచెప్పి వృక్షాల





హాతిం కిచ్చి మాయమయాడు

హాతిం ఆయన చెప్పినట్టుగానే చేశాడు. ఒక్క క్షణంలో అతను వాయు వేగంతో ఆ బస రీద పర్వతానికి చేరుకున్నాడు. ఆ పర్వతం పైకెక్కి చూశాడు. అక్కడొక నిర్మలమయిన సరస్సు కనిపించింది. దాంట్లో శుచిగా స్నానం చేసి భక్తిపూర్వకంగా సాధువు చెప్పిన మంత్రాన్ని జపించడం ప్రారంభించాడు. మరి కొంత సేపటికల్లా ఇంద్రజాల మహేంద్ర జాలాలతో తయారయిన మాయా జంతువు లెన్నెన్నో గబగబా పరుగెత్తుకుంటూ అక్కడి కొచ్చాయి. బద్రూకు డది కనిపెట్టి తన దివ్య దృష్టితో ఇదంతా యెందుకు జరుగుతుందో



తెలుసుకున్నాడు. అప్పు డాకాశవాణి యిలా చెప్పింది,-'హాతిం అనే టటువంటి పరోపకారి ఒకాయన నీ ఆశ్రమాని కొచ్చాడు. అతను మంచి బల పరాక్రమవంతుడైన రాజకుమారుడు. అతని ముందు నీ మాయ లేవీ పనికి రావు. అతను మీ అమ్మాయిని ప్రేమించాడు. ఆమె కోసం నీ ప్రాణాలు తీసేందుకు కూడా తయారై వచ్చాడు. అందుకనే అతనిప్పుడు సర్వశక్తి మంత్రాన్ని పఠిస్తున్నాడు."-

ఇది వినేసరికి బద్రూకుడు బలే గాబరా పడ్డాడు. ఇంకేం చెయ్యడం?-ఎలాగయినా హాతిం ఆ మంత్రాన్ని మరచి పోయేటట్టు చెయ్యాలని వెంటనే పన్నాగం పన్నాడు. తన ఇంద్రజాల విద్యతో కొంతమంది యక్షిణీ కన్యల్ని సృష్టించాడు. వారిలో ఒకామె సరిగ్గా ఫరీదా మోస్తరువుగానే వుండేటట్టు చేశాడు. వారందర్నీ హాతిం దగ్గరకు పంపించాడు. ఆమె రూప లావణ్యాలను చూసి హాతిం ఆమె నిజంగా ఫరీదా యేమో ననుకుని ప్రేమించి ఆమె మాయలో పడి పోయాడు—

ఆఖరికి హాతిం తను యెందు కొచ్చిందీ అది కూడా పూర్తిగా మరచి పోయాడు. ఫరీదా వేషంలో వున్న ఆ గంధర్వ కన్య హాతిం ప్రక్క కొచ్చి ప్రేమ పూర్వకంగా,— "ఏమండీ, నా గురించి మీ రెందు కనవసరంగా కష్టాల పాలవుతారు?-మా తండ్రిగారు నా పైని మీ కున్న అనురాగాన్ని స్వయంగా చూసి సంతోషించి ఆయనే నన్ను మీ దగ్గ



రకు పంపించారు. రండి. విచ్చలవిడిగా యే భయం లేకుండా విహరించుదాం" అంటూ యెంతో ముద్దుగా రమ్మని పిలిచింది.

ఆమె మాయదారి మాటలకు హాతిం యెప్పుడో లొంగి కృంగి పోయాడు మరి!— అందుకని ఆమెతో ఆ తోటలో విలాసాలతో విహరిస్తూ ఆట పాటల్లో కులాసాగా గడిపాడు. ఇలా ఆమెతో కాలక్షేపం చేస్తూండగా మాటల సందర్భంలో ఆమె హాతింకి తను తెచ్చిన మత్తు సారాయి నిచ్చింది. దాన్ని త్రాగేసరికి హాతిం అంతవరకూ పఠిస్తున్న మంత్రాన్ని పూర్తిగా మరచిపోయాడు. ఆ యదను చూసుకుని ఆ మాయలాడి హాతింని బంధించి బద్రూకుడి దగ్గిరికి తీసుకెళ్ళి అప్పగించింది. బద్రూకుడు కోపావేశంతో కళ్ళ వెంట చింత నిప్పులు కురిపిస్తూ అతణ్ని అగ్ని కుండం లోకి త్రోసి వేయమని ఆజ్ఞాపించాడు.

ఆ ఫళంగా గంధర్వ కన్య అదే ప్రకారంగా చేసింది. అయినా హాతిం దగ్గర యెలుగుబంటి రాకుమారి ఇచ్చిన ముత్యం వుందిగా!-దాని ప్రభావం వల్ల అతను అగ్ని బాధ నుంచి తప్పించుకున్నాడు. అది చూసి బద్రూకుడు నిర్ఘాంతపడి, హాతింని మళ్లీ యథా స్థానానికి తీసుకుపోయి వదిలి పెట్టమని ఆజ్ఞాపించాడు. ఆ ప్రకారం గంధర్వ కన్య హాతింని సరోవరం వొడ్డున వదిలిపెట్టి వెళ్ళి పోయింది. హాతిం దాంట్లో శుచిగా

3




స్నానం చేసి మళ్లీ మంత్రాన్ని పఠించడం ప్రారంభించాడు.

అప్పుడు బద్రూకు డేం జేశాడూ! — కాలభైరవ మంత్రాన్ని జపించి కాలభైరవుణ్ని సాక్షాత్కరింప జేసుకున్నాడు. హాతింని హతమార్చమని కోరుకున్నాడు.

కాని కాలభైరవు డన్నాడు గదా, "అయ్యా, హాతింకి పరిపూర్ణమయిన దైవకటాక్షం వుంది. ఆయుర్దాయం కూడా చాలా వుంది. అందువల్ల అతణ్ని చంపడం యెవరికీ సాధ్యం కాదు".

"అలాగా!—హాతింని యింత గొప్పవాణ్ణి చేస్తుంది ఆ సర్వశక్తి మంత్రమే!—అందుకని ఆ మంత్రం యెలాగయినా అతను మరిచ

పోయేటట్టు చేసి నన్ను కాపాడాలి" అంటూ వేడుకున్నాడు భద్రూకుడు.

ఇది విని కాలభైరవుడి కళ్లు కోపంతో యెర్రబడ్డాయి,-"ఇదుగో భద్రూకా, నువ్వెన్ని విధాల తంటాలు పడ్డా నీ పప్పు లేవీ వుడకవు. దైవకటాక్షం మెండుగా వున్న హాతిం దగ్గర నీ ఆట లేవీ పనికి రావు. అతనా మంత్రాన్ని జపించే టప్పుడు తొందర చెయ్యడం నా వల్ల కాదు సుమీ!—అయినా నువ్వింతగా బ్రతిమాల్తున్నావు గాబట్టి ఒక్క వుపకారం మాత్రం చేసి పెట్ట గలను. హాతిం యెప్పుడూ గాఢనిద్రలో మునిగిపోయి వుండేటట్టు చేస్తాను. అందువల్ల బహుశా ఆ మంత్రం మరిచిపోనూ మరచి పోవచ్చు." అన్నాడు.

అనడమే కాదు. అన్నంత పనీ చేశాడు. హాతింని స్మారకం లేకుండా పడుకుని వుండేటట్టు మంత్రించాడు. దాంతో హాతిం పాపం మతి తప్పి మంత్రం - గింత్రం అన్నీ మరచి పోయాడు. అలా వళ్లు మరచి పడుకున్న హాతిం తల పైని భయంకరమయిన రాక్షసు డొకడు పెద్ద గధతో దభేల్న బాదాడు. ఆ దెబ్బతో అతనికి వున్న మతి గూడా పోయింది. మరొక రాక్షసు డొచ్చి భద్రూకుడి అజ్ఞ ప్రకారం హాతింని యీడ్చుకుంటూ వెళ్ళి అగాధమయిన పెద్ద కందం లోకి విసిరి వేశాడు. ఆ కందకంలో పడగానే అతనికి తెలివి వచ్చింది. అప్పు డతను భగవంతుణ్ని భక్తి పూర్వకంగా స్మరించుకున్నాడు.

రెండు రోజులు గడిచాక భద్రూకు డొక భలే వుపాయాన్ని కనిపెట్టాడు. కందకంలో తిండీ తిప్పలూ లేకుండా వడ్డున పడ్డ చేప లాగ గిల గిల గింజుకుంటున్న హాతింని బయటికి తీసి బ్రతికిస్తానని ఆశ చూపించి యెలా గయినా అతని దగ్గరున్న ఆ ముత్యాన్ని కాజేయాలని పన్నాగం పన్నాడు.-(ఇంకా వుంది)





[సత్యం చెప్పే వాడు సదా సుఖిస్తాడు. అంటూ అరిచే అసామీ వృత్తాంతం యేమిటో కనుక్కోవాలని బయలు దేరాడు హాతిం. దార్లో అతనికి తలకాయల చెట్టు అవుపించింది. ఒక సాధువు ధర్మమా అంటూ హాతిం దాని రహస్యం తెలుసుకున్నాడు. ఆ తలకాయలను అలా పెట్టిన బద్రూకు డనే రాక్షసుడి కిది కిట్టలేదు. అందుకని తన బంట్లను పంపి హాతింని ఒక పెద్ద కందకంలోకి త్రోయించాడు.]

ప్రాణాల పైని తీపితో దాన్ని హాతిం యెలాగైనా యిచ్చి వూరుకుంటా డనుకున్నాడు. అందుకని కొంతమంది శిష్యుల్ని పిలిచి,- "ఇదుగో—చూడండి. ఒకవేళ అతగాడు ఆ ముత్యాన్ని యిచ్చేందుకు ఒప్పకోక పోతే రాళ్లతో చావ పొడవండి" అంటూ అజ్ఞాపించాడు.

ఆ శిష్యులు హాతిం దగ్గర కెళ్లి అలాగే చెప్పారు. ఆ కందకంలో నుంచి బయటికి లాగి బ్రతికిస్తామన్నారు. ఆ ముత్యాన్నెలాగయినా యిమ్మని చెప్పారు. అందుకు హాతిం ససేమిరా అంగీకరించ లేదు. అందుకని ఆ శిష్యులంతా కలిసి అతని పైని రాళ్ల వర్షం కురిపించడం మొదలెట్టారు. అప్పటికీ అతను లొంగలేదు. ఆఖరి కలా దెబ్బలు తింటూనే మూర్ఛ పోయాడు.

అర్ధరాత్రి అయింది. ఆ శిష్యుల్లో ఒకడు లేచి,-"ఇప్పుడు చావు బ్రతుకుల మధ్య సతమతమై పోతున్న హాతింని ఈ కందకంలో నుంచి కాపాడానంటే, అతను సంతోషించి అందుకు ప్రత్యుపకారంగా తన దగ్గరుండే ఒకే ఒకే అమూల్యమైన ముత్యాన్ని యివ్వకుండా వుంటాడా?" అని ఆలోచించుకున్నాడు. ఆ వెంటనే కిక్కురుమనకుండా హాతింని బయటికి తీసుకొచ్చాడు.

హాతిం ప్రాణాలతో బయటపడిన తర్వాత,- "నేస్తం, నువ్వు నాకు మహా వుపకారాన్ని చేశావు. అందుకు నీకేం కావాలో కోరుకో. తప్పకుండా తీరుస్తాను" అన్నాడు.

ఇలాంటి అదను కోసమే కనిపెట్టుకుని కూర్చున్న ఆ శిష్యుడు,-"అయ్యా, నాకు కావలసిందాన్ని అడిగే అభ్యాసం నాకు లేదు. మీ దగ్గరున్న దాన్నే అడుగుతున్నాను. ఆ వెల లేని ముత్యాన్నే నా కిప్పించండి" అంటూ అడిగాడు.

అందుకు హాతిం అన్నాడు గదా,-"నేస్తం, దాన్ని నీ కిచ్చేందుకు నాకేమీ అభ్యంతరం లేదు. అయితే అది నా సొంతం కాదు. నా ప్రయాణం సుఖంగా, నిరాటంకంగా జరిగే టట్టు యెలుగుబంటి రాకుమారి యిచ్చిన బహుమానం ఆ ముత్యం. అందువల్ల దాన్ని వ్వాలంటే కష్టం. కాని నువ్వు నా కెంతో సహాయ పడ్డావు గాబట్టి నీ గురువు తర్వాత, ఆ స్థానంలో నిన్ను కూర్చోబెడ్తాను".

రచన: "బాలమిత్ర"



ఇది విని హాతిం ధైర్యాని కెంతో మెచ్చు కున్నాడా శిష్యుడు. ఇక తన గురువు గారి ఆట లేవీ ఈయన దగ్గర సాగవనుకున్నాడు. మళ్లీ తను గురువు దగ్గర కెళ్తే హాతింకి వుపకారం చేసినందు కెలాగూ కోపం తెచ్చుకుంటాడు. తన కేదో పెద్ద శిక్ష విధించకమానడు. అందు వల్ల హాతింనే ఆశ్రయిస్తే మంచిదనుకున్నా డతను. అప్పట్నుంచీ హాతిం దగ్గరే వుండి పోయాడు.

బద్రూకుడి కిదంతా దివ్యదృష్టిలో తెలిసి పోయింది. వెంటనే హాతిం వున్న చోటి కొచ్చి తన మంత్రాన్ని ప్రయోగించాడు. కాని హాతిం మంత్రం ముందు అతగాడి మంత్రం యెం దుకూ పనికి రాలేక పోయింది. పైగా అతని మంత్రం అతణ్నే బెడిసి కొట్టింది. ఇలా యీ మంత్రాల యుద్ధం లోనే మరణించాడు బద్రూకుడు.

అప్పుడు హాతిం తనకు సహాయం చేసిన నేస్తాన్ని బద్రూకుడి స్థానంలో నియమించి, అందాల భామ ఫరీదా తల వేల్లాడే ప్రదేశాని కొచ్చాడు. అంతలోనే ఆమె మానవ రూపం దాల్చి తన చెలికత్తెలతో హాతిం కోసం ఎదురు తెన్నులు చూస్తూ నిల్చుంది. వారిద్దరికీ వైభ వంగా పెళ్లయింది. కొన్నాళ్లపాటు హాయిగా కాపురం చేశారు.

ఒకనాటి సాయింకాలం హాతిం ఒక చెట్టు క్రింద చల్లగా సాగవారాడు. ఆ చెట్టు పైనే



వుంటున్నాయి రెండు పక్షులు. అందులో ఆడపక్షి ఒకటీ, మగ పక్షి మరొకటి;—

"ప్రాణనాథా! మీరు నన్నొక్కర్తెనే వదిలి పెట్టి దేశాంతరాని కెళ్లకండి" అంటూ వేడు కున్నది ఆడపక్షి—

"నన్నేం చెయ్యమంటావు - నీ మాట దక్కించలేక పోతున్నాను. మరేమనుకోకు. నేను గౌరవం కోసం యీ ప్రయాణం పెట్టు కున్నాను. ఆ సత్కార్యం కాస్తా చేసేశానంటే అప్పుడే భగవంతుడి కటాక్షం నాకు కలుగు తుంది. మీ ఆడవాళ్ల కివేవీ తెలియవు. పైగా చెప్తే వినిపించు కోరు.. మీ మనసెప్పుడూ స్వార్థం కోసమే దేవుళ్లాడ్తూ వుంటుంది. లోగడ మహారాజొకడు స్త్రీ మాయలోపడి పశ్చాత్తాప





పడి నట్టుంది నా పరిస్థితి. అందుకని నువ్వు లక్ష చెప్పినా నా చెవి కెక్కవు" అన్నది మగ పక్షి—

"అదేమిటండీ, ఆ రాజు కథ. కాస్త చెపుదురూ!" అన్నది ఆడపక్షి—

అప్పుడు మగపక్షి ఆ కథ నిలా చెప్పడం మొదలెట్టింది.—

"చాలా కాలం క్రితం ఒక మహారాజుండే వాడు. అత నొక మారు అడవికి వేటకని వెళ్లి బాగా అలసి పోయి విశ్రాంతికని ఒక తోటలో కాలుపెట్టాడు, దాంట్లో రమణీయమైన పెద్ద రాజమహ లొకటివుంది. దాని చుట్టూ అందాల సరోవరం వుంది. ఆ రాజు దాంట్లో కాళ్ళూ - చేతులూ కడుక్కుందాం గదా



అని దిగాడు. అంతలో అతని చేతి కొక త్రాడు దొరికింది. ఏమిటి చెప్మా అని దాన్నింకా పైకి లాగేసరికి యేదో పెట్టె ఒకటి బయటి కొచ్చింది వెనక ప్రక్కనే దాని తాలూకు తాళం చెవి కూడా వుంది. ఆ పెట్టెలో యేముందో గదా అని దాన్ని హాతిం తెరిచి చూశాడు. ఇంకే ముంది?—దాంట్లో నుంచి ఒక అందాల సుందరి వయ్యారంగా వళ్లు విరుచుకుంటూ లేచి బయటి కొచ్చింది. ఆమె అందచందాలు చూసి మహారాజు నిశ్చేష్టు డయాడు. అది కనిపెట్టి ఆ సుందరి అన్నది కదా— "మహ రాజా, నేను గూడా మీ లాంటి మనిషినే. నా గురించి మీరేం సందేహించకండి. నే నిచ్చే యీ స్వల్ప ఫలహారం తిని విశ్రాంతి తీసు కోండి. అంతే చాలు"—

ఇలా చెప్పి ఆమె ఫలహారం మహారాజు ముందు పెట్టింది. ఫలహారం బలే రుచిగా వుంది. అందువల్ల దీన్ని తింటూ తన్మయుడై పోయాడు. దానికి తోడు ఆ సుందరి వయ్యారం వొలికిస్తూ చూపించే తళుకు బెళుకు లను చూస్తూ వుంటే అది భూలోకమా; స్వర్గ లోకమా అనిపించింది. కొంత సేపటికల్లా అతనికి తన వూరూ - తన పరిపాలనా జ్ఞాప కం వచ్చాయి. వెంటనే మహారాజు ఆమె దగ్గర సెలవు పుచ్చుకున్నాడు. కానయితే ఆమె అతగాణ్ని తన ప్రేమ మాటలతో మాయ చేసి బంధించాలనుకుంది. కాని లాభం లేక

పోయింది. మహారాజా ఫళంగా తన ఉంగరం ఒకదాన్ని తీసి ఆమెకిచ్చి తమ యిద్దరీ ప్రేమకు గుర్తుగా దాన్ని వుంచుకోమని చెప్పాడు. అప్పుడా సుందరి పెట్లో నుంచి ఒక పెద్ద ఉంగరాల గొలుసును తీసి చూపించింది.

"హాయ్ హాయ్ - ఎన్ని వుంగరాలో!— నీ కెలా వచ్చాయి?" అని అడిగాడా రాజు.

అందు కామె నవ్వు పువ్వుల్ని విసుర్తూ,- "రాజా, నా పెనిమిటి గూడా ఒక మహారాజు. నా మీద అయనకి నమ్మకం లేదు. అందుకని నన్ని పెట్లో పెట్టి తాళం వేసుకుని వెళ్లిపోతూ వుంటాడు. ప్రతీ రాత్రీ యిక్కడికొచ్చి నన్ను పెట్లో నుంచి బయటికి తీసి నాతో అటపాట లాడుకుని తెల్లవారే సరికి మళ్లీ పెట్లో పెట్టి నీట్లో పడేసి వెళ్లిపోతూ వుంటాడు. మహారాజా-మీరు దారితప్పి యెలాగో ఇక్కడి కొచ్చారు. అలాగే అనేకమంది యిక్కడికొస్తారు. నాతో కాస్సేపు కాలక్షేపం చేసి ఒక్కొక్క వుంగరం యిచ్చి వెళ్లి పోతూ వుంటారు. అలాంటివే యీ వుంగరాలన్నీ;"- అన్నది.

అప్పుడు మహారాజు ఆశ్చర్యపడి ఆమెని మళ్లీ పెట్లో పెట్టి తాళం వేసి నీట్లో దాచివెళ్లి పోయాడు. చూశావే మరి, స్త్రీల స్వభావం యెంత చంచలంగా, వుంటుందో! వారిమాయ మాటలను నమ్మి మోసపోయే వాడెంత తెలివి తక్కువవాడో నువ్వే చెప్పు. అందుకే నీ మాటల నిప్పుడు లెక్కపెట్టకుండా పరమేశ్వరుడి ప్రీతి కోసం తలపెట్టిన కార్యం నెరవేర్చడానికే బయలుదేరుతున్నాను. అడ్డు చెప్పకు. లేకపోతే ఫరీదా ప్రేమలోపడి పరోపకార కార్యాన్ని పూర్తిగా మరచి పోయిన మూర్ఖుడు ఈ హాతిం లాగే నేను కూడా అపకీర్తి పాలవ







"వలసి వస్తుంది." అన్నది మగ పక్షి నిర్మొగ మాటంగా-

శూలపుపోట్లులాంటి యీ మాటలు చెవిని పడగానే హాతింకి టపీమని తన కర్తవ్యం గుర్తు కొచ్చింది. చివాల్నలేచి అలాగే నడిచి వెళ్లిపోయాడు. ఆఖరికి ఫరీదా దగ్గరికెళ్లి తను వెళ్లిపోతున్నట్టు కూడా చెప్పలేదు.

మరి కొన్నాళ్ల కతను కారామ నగరం చేరుకున్నాడు. అక్కడ పచారు చేస్తుండగా అతనికి కావలసిన వాక్యాలు ఒక ఇంటి వాకిట్లో గోడ పైని వ్రాసి వుండడం కనిపించింది. హాతిం తిన్నగా ఆ యింట్లో కెళ్లి అక్కడుండే సేవకుడి ద్వారా యింటి యజమాన్ని పరిచయం చేసుకున్నాడు. ఆయన హాతింకి తగు మర్యాద లన్నీ చేసి తనప్రక్కను కూర్చోబెట్టుకుని కుశల ప్రశ్న లడిగాడు తర్వాత యిద్దరూ భోంచేశారు. హాతిం కొంతసేపు విశ్రాంతి తీసుకున్నాడు. తర్వాత యింటి యజమాని, -"పరోపకారి వైన హాతిం, మీ రిక్కడికి రావడానికి గల కారణ మేమిటి?" అని అడిగాడు

అప్పుడు హాతిం హుస్నబాను సంగతీ, తన నేస్తం మునీర్ సంగతీ హుస్నభాను అడిగిన నాలుగవ ప్రశ్న సంగతీ అన్నీ సవివరంగా చెప్పాడు. ఆ ఇంటి వాకిట్లో గోడ మీద అలాటి వాక్యాలు వ్రాయడానికి గల గూఢార్ధ మేమిటో చెప్పమని కోరాడు.

అప్పుడా యింట యజమాని అన్నాడు గదా,-"ఇతరుల క్షేమంకోసం యిన్ని కష్టాలు పడుతున్న మీ వంటి మహానుభావులకు ఈ వాక్యం తాలూకు అర్థాన్ని నేను విప్పి చెప్పడం పెద్ద ఘనకార్యం కాదు. చెప్తా వినండి. ఇప్పటికి యెనిమిది వందల సంవత్సరాల క్రితం సంగతి-నేనప్పటికి చాలా చిన్నవాణ్ణి లెండి. జూదంలో నాకున్న యావదాస్తినీ పోగొట్టుకుని నిరుపేదనై పోయాను. అప్పుడు నాకు డబ్బు సంపాదించాలనే దురాశ యెక్కువయింది. ఆ ఫలంగా మహారాజు మహల్లో నున్న అపరిమితమైన సంపద సంతటినీ దోచుకుని అరణ్యాలు పట్టాను అక్కడ మరి కొంతమంది దొంగలు నాలాగే దోచుకుని దొంగతనం వేసుకొచ్చిన సంపదను పంచు





కుంటున్నారు. వారంతా నన్ను చూసి నా మీద ఒక్కుమ్మడిగాపడి నా సంపద నంతటిని అక్కడ పెట్టమని నిర్బంధించారు. నేను తెచ్చిన దంతా వారి ముందు పెట్టాను. అంతలో భయంకరమైన తుఫాను బయలు దేరింది. ఉరుములూ-మెరుపులూ ఆర్భాటం చేశాయి. జోరీపాతంగా వర్షం కురవ సాగింది. అడవిలోవుండే పెద్ద పెద్ద వృక్షాలన్నీ ఫెళఫెళ మంటూ విరిగి పోసాగాయి. అనుకోకుండా యింత అదటున వచ్చిన తుఫానుకి బెదరి బేజారెత్తి దొంగలంతా ఆ సంపద నంతటినీ అక్కడే వదిలిపెట్టి పారిపోయారు. మరి కొంత సేపటి కల్లా గాలివాన ఆగిపోయింది. అప్పుడొక మహానుభావుడు నాకు కనిపించి,- "ఎవరు నువ్వు?-ఇక్కడి కెందు కొచ్చావు?" అని అడిగాడు.

అందుకు నేను జరిగిన సంగతంతా వున్న దున్నట్టు చెప్పి, అక్కడే పడి వున్న అపార మైన సంపదను చూపించాను. నేను నిజం చెప్పినందు కాయన, యెంతో మెచ్చుకుని నన్ను క్షమించడమే గాకుండా, యిటుపైని జూద మాడనని నా చేత వొట్టు పెట్టించు కున్నాడు. వెయ్యేళ్లు వర్ధిల్లమని నన్ను ఆశీర్వ దించి అంతర్ధాన మయాడు.

ఆ మహానుభావుడి మాట ననుసరించి, ఆ సంపద నంతట్నీ తీసుకుని కొంత డబ్బుతో ఈ యిల్లు కట్టించాను. దీన్ని చూసి నా సాటి వారు కొంత మంది అసూయ పడ్డారు. వీడింత శ్రీమంతు డెలా గయ్యాడు చెప్మా అని వారంతా నా గురించి పరి పరి విధాల ఆలో చించారు. ఆఖరికీ సంగతి మహారాజు దాకా వెళ్లింది. ఇదేదో విచారణ చేసి రమ్మని ఆయన కొత్వాలును పంపించాడు. కొత్వాలుకి కూడా జరిగిన సత్యం వివరించాను. అతను నన్ను మహారాజు దగ్గరకు తీసుకెళ్లి హాజరు పరచాడు. ఆయనకు కూడా ఉన్నదున్నట్టే సత్యం చెప్పివేశాను.

"అయినా మహారాజు నేను చెప్పిన సంగ తంతా విని సంతోషించి నన్ను వదిలి పెట్టి ఈ సంపద నంతట్నీ నాకు బహుమానంగా యిచ్చి సత్కరించాడు. ఇంటికి చేరుకున్న మీదట "సత్యం చెప్పేవాడు సదా సుఖి స్తాడు" అనే వాక్యాల్ని వాకిట్లో గోడ పైని



వాయించాను. అప్పుడు మొదలుకుని యింత వరకూ యిక్కడి కొచ్చే సత్పురుషులకి సేవ చేస్తూ వుంటున్నాను. భగవంతుణ్ని స్మరించు కోవడమే నా ప్రధాన కర్తవ్యం" అంటూ ముగించాడా ముసలాయన.

అది విని హాతిం యెంతో సంబరపడి ఒకటి రెండు రోజు లతని దగ్గరే వున్నాడు. తర్వాత అతని దగ్గర సెలవు పుచ్చుకుని మళ్లీ షహాబాదు కెళ్లి తన నేస్తం మునీర్‌తో హుస్న భానుని కలుసుకుని ఆమె తాలూకు నాలుగో ప్రశ్నకి సరియైన సమాధానం చెప్పాడు. దాంతో హుస్నభానుకి పరమానందమై, పంచ భక్ష్య పరమాన్నాలతో వారిని మర్యాద చేసింది.

రెండు రోజు లామె ఆతిథ్యాన్ని స్వీకరించి మూడో రోజున హాతిం "మీ అయిదో ప్రశ్న యేమిటో చెప్పండి" అని అడిగాడు.

"కోహనిదా, అంటూ అరిచే పర్వతం తాలూకు వృత్తాంత మేమిటో తెలుసుకుని రావాలని చెప్పింది హుస్నభాను.

ప్రశ్న విని పయన మయ్యాడు హాతిం. ఆరు నెలల పాటు అలా నడిచి వెళ్లగా వెళ్లగా అతని కొక పట్టణం తారస పడింది. ఆ పట్ట ణాని కెళ్ళే దోవలో వుందొక శ్మశానం. అక్క డొక శవం చుట్టూ యెవరో కొంత మంది భోజనాలకు కూచున్నట్టు కనిపించింది. అదే మిటి చెప్మా ఆ విడ్డూరం అనుకుని హాతిం ఆ శవం చుట్టూ కూచున్నవారిని వాకబు చేశాడు. అప్పుడు వారంతా అన్నారు గదా, "మేమింకా భోజనాల కుపక్రమించ లేదు. ఎందుకంటే యెవరో ఒక బాటసారి రావాలి. అప్పుడతనితో కలిసి అయిదుగురం కావాలి. అంతవరకూ భోజనం ముట్టం. మే మొచ్చి వారం రోజు లయినా ఒక్కరూ రాలేదు.

(ఇంకా వుంది)



[హుస్నభాను అడిగిన అయిదో ప్రశ్న! "కోహనిదా అంటూ అరిచే పర్వతం తాలూగు వృత్తాంత మేమిటో తెలుసుకుని రావాలి" అందుకని బయలుదేరాడు హాతిం. అలా వెళ్ళగా ఒక పట్నం తారసపడింది. అక్కడ శ్మశానంలో ఒక శవాన్ని పెట్టుకుని నలుగురు దాని చుట్టూ భోజనాలు వడ్డించుకుని కూర్చున్నారు]

ఇప్పుడు మీ రొచ్చారంటే అంతా ఆ దైవ కృప. అందుకని దయచేసి మాతో భోం చేయండి."

అది విని హాతిం ఆశ్చర్యపడ్డాడు,-"అలా గైతే నెలల తరబడిని బాటసారు లెవ్వరూ రాకపోతేనో?" అన్నాడు ప్రశ్నార్థకంగా.

"అలాంటి సందర్భం యింతవరకూ రాలే దనుకొండి. ఒకవేళ అలా యెవరూ రాక పోతే పది రోజులు మాత్రం చూసి అంతా భోంచేసి శవాన్ని దహనం చేసి యింటి కెళ్లి పోతాం" అన్నారు వారంతా.

ఆ వూరి ప్రజల తాలూకు యీ పిచ్చి ఆచారాన్ని చూసి హతిం నిర్ఘాంతపడి, వారి తోబాటు భోంచేశాడు. భోజనాలయేక శవాన్ని దహనం చేసి అంతా తమ తమ యిళ్లకు బయల్దేరి వెళ్లిపోయారు. ఈలోగా వారు హాతిం తాలూకు వృత్తాంత మంతా ఆలకించి అతణ్ణి తమ రాజుగారి దగ్గరకు తీసుకెళ్లి పరి చయం చేశారు. మహారాజు హాతింని ఎంతో ఆదరించి, సత్కరించి ఆయన అలా రావడా నికి కారణ మేమిటో తెలియ జెప్పమని కోరాడు.

అప్పుడు హాతిం తన కోహనిదా పర్వతం తాలూకు వివరాలు తెలుసుకుందు కొచ్చాననీ, అదెక్కడుందో చెప్పమనీ అడిగాడు.

అందుకు మహారాజు,-"ఎప్పుడు చూసినా చీకటిగా వుండే ఝులమత్ అరణ్యానికి దక్షిణం వైపునే వుంది నాయనా ఆ పర్వతం. దానికి సమీపం లోనే 'నైడా' నగరం వుంది. అక్కడుండే వారికి యెలాంటి రోగాలూ లేవు. ఇంతవరకూ అక్కడ ఒక్కడూ చచ్చిపోవ డం చూడలేదు." అని చెప్పాడు.

ఈ సంగతి వినగానే హాతిం పరమానంద పడ్డాడు. అతను మహారాజు దగ్గర సెలవు పుచ్చుకుని అక్కణ్నుంచి బయల్దేరాడు. మూడు నెలలపాటు నడచివెళ్లి ఆఖరి కొక పట్టణానికి చేరుకున్నాడు. అక్కడ యెవరో కొంతమంది గుమిగూడి ఏదో చర్చిస్తూ కూర్చు న్నారు. హాతిం వారిని తను వెళ్లవలసి వున్న 'కోహనిదా' పర్వతం గురించి అడిగాడు.

ఆ పేరు వినగానే వారంతా ఆశ్చర్యపడి,- అమ్మయ్యో-అది మనలాంటి మనుషులకి సాధ్యం కాదు బాబూ-అంత భయంకరమైన ప్రదేశమది!" అన్నారు.

అందుకు హాతిం నవ్వుతూ,-"ఫర్వాలేదు. ఆ పరమేశ్వరుడి కృప అనేది వుంటే ఎలాంటి

కష్టమైన పని అయినా యిట్టే చేసి వేయ వచ్చు" నన్నాడు.

వారిలో ఒకతను హాతింని తమ ఇంటికి భోజనాని కని పిలుచుకుని వెళ్లాడు. ఆ ఇంట్లోనే చావడానికి సిద్ధంగా వున్న మనిషొక డెవడో వున్నాడు. చుట్టూరా వున్నవాళ్ళు అతణ్ణి నరికి ముక్కలు ముక్కలుగా కోసి ఆ మాంసపు కండల్ని ఒక్కొక్కరే పంచు కున్నారు.

అది చూసి హాతిం,-"వీళ్ళెవరో నరబలి యిచ్చే దేవీ భక్తుల్లాగ వున్నారు. వీళ్ళ దగ్గర వుంటే యేదో ఒకనాడు నన్ను కూడా ఇలాగే ముక్కలు ముక్కలుగా చీరి గుటుక్కున మింగివేయక మానరు." అనుకుని మర్యాదగా అక్కణ్ణుంచి జారుకుని చల్లగా ప్రక్కనున్న అడవికి చేరుకున్నాడు. అన్నహారాలు లేకుండా వెళ్తున్న అతనికి కందమూల ఫలాలే ఆధారమయాయి. వాటిని తిని విశ్రాంతి తీసుకుని అక్కణ్ణుంచి మళ్లీ బయలు దేరాడు. కొంచెం దూరం అలా వెళ్ళేసరికి ఒక వూరు తగిలింది. ఆ వూళ్లోకెళ్ళి చూసేసరికి అక్కడ కాకి పిట్టయినా కనిపించలేదు. మచ్చుకొక్క మనిషయినా లేడు. వూరుదాటి కాస్త దూరం వెళ్ళేసరికొక పెద్ద మైదానంలో భగభగమని మండుతూ వున్న పెద్ద చితి కనిపించింది. దాని చుట్టూ ఆ వూరి జనమంతా విచారంగా కూర్చున్నారు. హాతిం అక్కడికెళ్ళి "ఏమిటయ్యా ఇదంతా?" అని అడిగాడు. అప్పుడు వారిలో పెద్ద ఒకాయన ముందుకొచ్చి,---



"అయ్యా, ఈవేళ ఒక అసామీ మరణించాడు. అతగానితోబాటు అతని యిల్లాలు కూడా సహగమనం చెయ్యాలనే రివాజు ప్రకారం ఈ మహాసభ యేర్పాటు చేశాం. అదుగో-ఆ మరణించిన అతని భార్య సహగమనం చేసి 'సాధ్వీమణి' అనిపించుకుంటూ వుంది, చూశారా?" అన్నాడు.

"అయ్యయ్యో-ఇది మీ మూఢ నమ్మకం. దీనివల్ల ఒక ప్రాణాన్ని బలవంతంగా తియడం తప్పించి, యిలాంటి పనికి యే దేవుడూ మెచ్చుకోడు. ప్రతీ జీవినీ దేవుడు ఒంటిగానే సృష్టించాడు గాని జంటగా కాదు. కాబట్టి ఆ జీవి చచ్చేటప్పుడు కూడా ఒంటిగా చావవలసిందే!-ఈ లోకంలోని సంబంధ బాంధవ్యాలన్నీ వఠి మాయ! దైవవశాత్తూ చావు దానంతటదే వస్తే సరే సరి-కాని ఆయుర్దాయం తీర



డానికి ముందే మనిషిని బలవంతంగా చంపడం మహాపాపం, లేకపోతే అది యెంతటి గొప్ప కారణం వల్లనైనా సరే, ఆత్మహత్యే అనిపించుకుంటుంది. ఆత్మ హత్య అనేది పంచ మహాపాతకాల్లో ఒకటి. మీరంతా యిలాంటి పని చెయ్యకూడదు. లేకపోతే మహా పాపానికి గురి అవుతారు" అంటూ వారికి ఉపదేశించాడు హాతిం.

ఈ వుపదేశ మంతా విని అక్కడున్న వారు తాము యింతకాలం నుంచీ చేస్తున్నది మహా పాప కార్యమని గుర్తించు కున్నారు.

"అయ్యా, ఇటుపైని మే మెప్పుడూ ఇలాంటి నీచకార్యం చెయ్యం. ఆ దేవుడి మీద ఒట్టు" అంటూ వొట్టు పెట్టుకుని చెప్పారు. అంతేకాదు. తమ బ్రతుకులు బాగు చేసిన హాతింని యెన్నోవిధాలుగా మర్యాదలూ-మన్ననలూ చేసి పంపించారు.

హాతిం అక్కణ్ణుంచి తన కార్యం నిమిత్తం ముందుకి సాగిపోయాడు. దార్లో ఎన్నెన్నో భయంకరమైన అడవులూ, ఎత్తయిన పర్వతాలూ అడ్డు పడ్డాయి. వాటన్నిటినీ ధైర్యంగా అవలీలగా దాటి వెళ్ళిపోయాడు హాతిం. ఒక చోట అతను వెళ్ళే దారి రెండుగా చీలి పోయింది. ఎటు వెళ్ళడం?-ఎటు మానడం? ఏమీ పాలుపో లేదు. ఆఖరికి భగవంతుణ్ణి మనసులో ధ్యానించుకుని, ఏమయితే అదే అయిందని ఆ రెండింటి లోనూ ఒకదారి బట్టి వెళ్లాడు.

ఆ దారి వెంట చాలాదూరం నడిచి వెళ్ళేక ఘోరమయిన కీకారణ్యం అతనికి కనిపించింది. ఆ యరణ్యంలోబడి వెళ్లి పోతూంటే, అదేం విడ్డూరమయిన జంతువో మరి, మహా భయంకరమయిన క్రూరజంతు వొకటి గబగబా వచ్చి హాతిం పైని బడింది. దాంతో తన ప్రాణాలు 'హరీ' మంటా యనుకున్నాడు ఇక బ్రతికే ఆశ పూర్తిగా వదులుకున్నాడు. ఆ కంగారులో పక్కనున్న పెద్ద చెట్టు పైకెక్కి బెంగతో కూర్చున్నాడు. అది కనిపెట్టి ఆ క్రూర జంతువేం చేసిందో తెలుసా?-తన తోకనా చెట్టు మొదలుకి చుట్టి దాన్ని కూకటివేళ్ళలోకి పెళ్లగించడం ప్రారంభించింది. ఇకఎలాగూ బ్రతికే వుపాయం కనిపించ లేదు. అలా గని బెదిరి ఆ క్రూరజంతువు నోట్లో వృత్తపుణ్యానికి పడే కన్న, వీరుడి లాగ దాంతో తల పడి

పోరాటం చెయ్యడం మంచిదనుకుని హాతిం దభీమని ఆ చెట్టు పైనుంచి క్రిందికి గెంతి వేశాడు. అది చూసి ఆ భయంకర జంతువు గభాల్న అతని పైకి వురికింది. వెంటనే హాతిం దైవాన్ని స్మరించుకుని తన కత్తితో ఠక్కున దానితల పైని ఒకవేటు వేశాడు. తర్వాత దాని మెడ పైనీ—కడుపు పైనీ కత్తి పోట్లు పొడి చాడు దాని వళ్లంతా రక్తం కారడం అరం భించింది. ఆ దెబ్బల కోర్వలేక అంత పర్వ తం లాంటి జంతువూ దభీమని నేలకూలి ప్రాణాలు వదిలిపెట్టింది. గుర్తు కోసం హాతిం దాని తోక, చెవి, కోరదంతాలు తీసుకుని దగ్గర పెట్టుకున్నాడు. ఈ సంగతి ప్రక్కనే వున్న పల్లెటూళ్లోని వారందరికీ తెలియ జేశాడు ఇన్నాళ్లూ ఆ జంతువు చేస్తున్న అగడాలకు భయపడి ఆ వూరి రాజుగారు సహా అంతః పురం వదిలి బయటికి రాలేదు. అందువల్ల హాతిం చూపించిన అపూర్వ సాహస పరాక్ర మాల కాయన మెచ్చుకుని ఆ వూరి ప్రజ లందర్నీ రావించి, వారి మధ్య హాతింని గొప్పగా గౌరవించాడు. అంతే కాదు. తన యేకైక కుమార్తెని అతని కిచ్చి పెళ్ళి చేసి, అతణ్ని ఆ రాజ్యానికి యువరాజుగా చేశాడు.

అయితే మరి హాతిం అక్కడే కలకాలం వుండిపోతే యెలా మరి!-తన పని యెవరు చేస్తారు?-అందువల్ల దాన్ని పూర్తి చేసేవరకూ తన కెలాంటి సుఖాలూ అక్కర్లేదని ఖచ్చి తంగా తేల్చి చెప్పాడు. అప్పుడు నైడా పర్వ తానికెళ్ళే దారిని చూపించేందుకు మహారాజు హాతింతో తన సేవకు లిద్దరిని పంపించాడు. వారిద్దరూ హాతింని నైడా పర్వతం చేరు కునేందుకు దగ్గర తోవ చూపించి తిరుగు ముఖం పట్టారు. కాని హాతిం మాత్రం నాలుగు రోజులు అలా నడిచి వెళ్ళి ఒక పట్టణానికి చేరుకున్నాడు. అక్కడి రాజు హాతిం తాలూకు పూర్వాపర సందర్భాలన్నీ విచా





రించి, అతనికి గొప్ప మర్యాదలు చేశాడు అప్పుడు హాతిం ఆయనకి తను వచ్చిన కార్యం గురించి వివరించి చెప్పాడు. తనను నైడా పర్వతానికి దిగఙెట్టినట్టయితే యెంతో వుప కారం చేసిన వారవుతా రన్నాడు.

అందుకా రాజు, - "అయ్యా, ఇక్కడ కొన్నాళ్లపాటు మాతోవున్నారంటే,మీ అంతట మీకే ఆపర్వతంసంగతి తెలుస్తుంది"అన్నాడు.

"సరే, అలాగే నన్నాడు హాతిం. రాజూ-ప్రజలూ అతణ్ని యెంతో గౌరవ పూర్వకంగా చూసుకుంటున్నారు. అతని కక్కడ అందరూ పరిచయ మయ్యారు.

ఒకనాడు మాట పైని మాట వచ్చి నైడా పర్వతం ముచ్చట కూడా వచ్చింది. ఆ పర్వ తం సంగతేమిటని అడిగాడు హాతిం.

అక్కడున్న వారిలో ఒకతను లేచి,- "అదుగోనండీ, దూరంగా కనిపిస్తుండే కొండ! అదే నైడా పర్వతం" అన్నాడు.

అంతలో సింహగర్జన లాంటి దేదో శబ్దం వినిపించింది. అక్కడున్న వారిలో ఒకాయన కొంతసేపు కిక్కురుమనకుండా కూర్చుని, తర్వాత అక్కణ్నుంచి లేచి తిన్నగా ఆ పర్వ తం దగ్గరకు గబగబా పరుగెత్తుకుంటూ వెళ్లాడు. అక్కడున్న వారతణ్ని పట్టుకోడాని కని పరుగెత్తారు కాని సాధ్యపడ లేదు.

"ఇక్క డందరితోనూ వున్నవాడు వున్నట్టు వుండక యెందుకలా పరుగెత్తి పోయాడు?" అంటూ అడిగాడు హాతిం.

"అది మాకేం తెలుసు నండి? మీకు తెలుసుకోవాలని వుంటే ఆ పరుగెత్తి పోయే అసామినే అడగండి" అన్నారు మిగతావాళ్లు.

తర్వాత పారిపోయిన అసామీ తాలూకు బంధువులూ - స్నేహితులూ వూరి బయట యేవేవో కర్మలన్నీ జరిపి తమ తమ ఇళ్లకెళ్లి పోయారు.

అదంతా చూసి హాతింకి బలేకుతూహలం కలిగింది. మరొకసారి హాతిం కొంతమందితో మాట్లాడుకుంటూ కూర్చుని వుండగా మళ్ళీ ఆ పర్వతం నుంచి 'కోహనిదా' అనే ధ్వని వినిపించింది. అంతవరకూ అక్కడ అందరి తోనూ కూర్చున్న యూసుఫ్ గబుక్కున లేచి ఆ పర్వతం వైపు పరుగెత్తి పోవడం ప్రారం భించాడు.- అలా యెందుకో, ఆ చోద్య మేమిటో, హాతిం కేమీ అర్థం కాలేదు. ఆ





ఫళాన అతను లేచి పరుగెత్తి పోతున్న యూసుఫ్ వెంటబడి, ఆఖరి కెలాగో అతణ్ని పట్టుకున్నాడు.-"అదేమిటయ్యా అంత విడ్డూరం?-నువ్వింత యిక్కడే కూర్చున్నావు. అంతలో 'కోహనిదా' అనే ధ్వని రాగానే యిలా వున్నవూపున పరుగెత్తు కొచ్చావేం?-ఇందులో వుండే రహస్య మేమిటి?-నాకు వివరంగా చెప్పాలి" అన్నాడు హాతిం.

కాని యూసుఫ్ మాత్రం అందుకు జవాబేమీ చెప్పకుండా చేతిని విదిలించుకుని ఒకటే పరుగు ప్రారంభించాడు. కాని హాతిం అంతటితో వదిలిపెట్టాడా?-అబ్బే!-వాడి వెంటబడి మళ్ళీ పరుగెత్తు కెళ్లాడు. వారిద్దరూ ఆ పర్వతం దగ్గరకు చేరుకోగానే అది రెండు ముక్కలుగా విడి పోయింది. వారిద్దరూ దాని మధ్య నుండే సొరంగంలో అడుగు పెట్టారు. తర్వాత పర్వతం మళ్లీ యిదివరకు లాగే కూడుకు పోయింది.

అలా కొంచెం ముందు కెళ్ళేసరికి పచ్చ రంగు ప్రదేశం కనిపించింది దాన్ని దాటి వెళ్ళేక నల్ల రేగడి ప్రదేశం కనిపించింది. అక్కడ చుట్టూ చిన్న రాతి చపటాలున్నాయి. వాటిపైని ఒక్కొక్క మంచం వుంచారు. ఆ ఫళంగా యూసుఫ్ ఒక అరుగు పైనున్న మంచం పైని పడుకున్నాడు. ఇంకేముంది?-మరు క్షణంలో ఉఫీమని అతని ప్రాణం ఒక పక్షి రూపంలో తుఝ్ఝున యెగిరి మాయమయి పోయింది. తర్వాత యూసుఫ్ శవం వున్న అరుగు గభాల్న రెండు భాగాలుగా విడి పోయింది. మంచంతో సహా యూసుఫ్ భూమిలో కెళ్ళి పోయాడు. మళ్లీ అరుగు యధాప్రకారం కలిసి పోయింది. అదంతా చూసేసరికి హాతింకి యేదో కనుకట్టు లాగ అనిపించింది. అతను ఆశ్చర్య పడుతూ ఒక సారి భగవంతుణ్ని స్మరించుకుని వెనక్కి తిరిగాడు. కానయితే మొదట వచ్చిన దారేదో పాపం మరిచి పోయాడు. అయినా గాబరా పడకుండా అటూ యిటూ తచ్చాడుతూ ఆఖరికి సముద్ర తీరానికి చేరుకున్నాడు. అప్పుడు సముద్రంలో పోటెక్కువగా వున్నందువల్ల ఆ చుట్టుపట్ల వుండే ప్రాంతాలన్నీ జలమయి పోయాయి. మరికొంత సేపటి కల్లా సముద్రం పూర్తిగా పొంగి పోయింది. హాతిం ఎలాగురా భగవంతుడా అనుకున్నంతలోనే చిన్న





పడవేదో సముద్రంలో నుంచి ఒడ్డుకి వస్తూ వుండడం కనిపించింది. దాంట్లో నుంచి జల దేవత ఒకామె పైకి వచ్చి,-"హాతిం మరేం భయపడకు. ఈ పడవలో కూర్చో. నీకు ముక్తి కలుగుతుంది'' అని చెప్పి టక్కున మాయమై పోయింది.

అప్పుడు హాతిం భగవంతుణ్ని స్మరించు కుని ఆ పడవ లోకి ధైర్యంగా యెక్కాడు. దాంట్లో మూడు రొట్టెలు కూరా-మంచి నీరూ వున్నాయి. హాతిం ఆ రొట్టెలు తిని నీళ్లు త్రాగి ఎన్నాళ్లనుంచో బాధ పెడ్తున్న ఆకలిని తీర్చు కున్నాడు. ఆ పడవలో యేడు రోజులు యేక లగువున సముద్రం పైని ప్రయాణం చేయగా యెనిమిదవ నాడతని కొక పర్వతం కనిపించింది. హాతిం అక్కడ దిగి ఆ పర్వతం పైకెక్కడం మొదలెట్టాడు. అక్కడే వున్నాయి పసుపు పచ్చ రంగు పక్షులు. ఎర్రటి నీళ్ళతో నది ఒకటి పార్తూ వున్నది. దాని వొడ్తు వెంట రోజల్లా నడిచి యెట్టి సముద్ర తీరానికి చేరుకున్నాడు. ఇదివరకు మోస్తరుగానే అక్కడ కూడా ఒక పడవ తయారుగా వున్నది. హాతిం దాన్నెక్కి మళ్లీ సముద్రం ప్రయాణం సాగించాడు. "ఇలా వెళ్ళిపోతూ వుంటే ఇక అంతెక్కడ?-మళ్లీ స్వదేశాని కెప్పుడు చేరుకోవడం?—నేను రాలేదని నా నేస్తం నా పైని నమ్మకం పోగొట్టుకుని ప్రాణాలే వదులు కుంటాడేమో!-దాంతో మిత్రద్రోహం చేశాననే అపనింద నాకు రాక మానదు" అంటూ ఆలోచించుకున్నాడు హాతిం. కొన్నాళ్లు ప్రయాణం చేసిన మీదట అతను నీలి సముద్రం సముద్రందాటి సముద్రానికి చేరుకున్నాడు. ఆకలి దప్పులతో అతను అలుమటించి పోతూ ఎంతో కష్టంగా గడిపాడు. కాస్త నీరయినా నోట్లో పోసుకుందాని అతను సముద్రంలో తన చేతిని అద్దాడు.

[ఇంకా వుంది]



[ 'కోహనిదా' అంటూ అరిచే పర్వతం తాలూకు వృత్తాంత మేమిటో తెలుసుకోవాలని నైడా పర్వతం సమీపించాడు. అయితే ఆ పర్వత రహస్యం, హాతింని చిక్కులో పెట్టింది. జలదేవత సహాయంచే హాతిం పడవెక్కి మళ్లీ సముద్ర ప్రయాణం సాగించాడు. ఆకలి దప్పులతో అలుమటించాడు. కాస్త నీరైనా నోట్లో పోసుకుందామని హాతిం సముద్రంలో తన చేతిని అద్దాడు ]

కాని అంతలోనే అతని చేతులు రెండూ వెండి మయమై పోయాయి. దాంతో అతని విచారం మరీ యెక్కువయింది. కళ్ల వెంట ధారాపాతంగా కన్నీళ్ళు కార్చాడు. అక్కడే ఒడ్డు నున్న పడవపై నెక్కి నాలుగు రోజులు ప్రయాణం చేసి ఆ సముద్రతీరానికి చేరుకుని అక్కడ అటూ యిటూ విహరించ సాగాడు. అక్కడ యెన్నెన్నో రకాల వజ్రాల రాళ్లు అతనికి కనిపించాయి. వాటిని చూసి వాటిని సృష్టించిన దేవుణ్ని భక్తి పూర్వకంగా స్మరించుకున్నాడు.

వాటిని తీసి పరీక్షించి చూడగా అవి యెంతో అమూల్యమైన వజ్రాలుగా అవుపించాయి. ఎంతో జాగ్రత్తగా హాతిం వాటిలో కొన్నిటిని తీసుకుని మరికొంత ముందుకి నడిచాడు. అక్కడ వీటికన్న మరింత కాంతిగా వుండే వజ్రాలు కనిపించాయి. అందుకని యిదివరకు పట్టుకున్న వజ్రాలన్నిటినీ అక్కడే వదిలిపెట్టి కాంతివంతమైన ఉత్తమ వజ్రాల్ని తీసుకున్నాడు.

అలాగే ముందు ముందుకి వెళ్తున్న కొద్దీ మేలయిన మంచి మంచి వజ్రాలు కనిపించేవి. అప్పుడు హాతిం పాత వాటిని వదిలి పెట్టడం, క్రొత్త వాటిని తీసుకోవడం—యిలా చేసుకుంటూ ముందుకెళ్లాడు. అలా వెళ్తూ వుంటే పక పకమని యెవరో నవ్వుతున్న ధ్వని వినిపించింది. హాతిం అదేమిటో గదా అని చట్టున తిరిగి చూశాడు. కాని యెవ్వరూ కనిపించ లేదు. దార్లో ఒక పెద్ద నది కనిపించింది. దాంట్లో హాతిం చేతులు పెట్టగానే మళ్లీ అవి యథాప్రకారం మామూలు చేతులుగా మారిపోయాయి. అది చూడగానే హాతింకి అపరిమితానంద మయింది. ఆ నదిలో వుండే నీటిని కడుపునిండా త్రాగి దాని ఒడ్డునే ఒక చెట్టు క్రింద చల్లగా నిద్ర పోయాడు.

అతలోనే హాతిం కొక కల వచ్చింది. ఆ కలలో సగం మనిషి-సగం సింహం ఆకారంలో వుండే నరసింహమూర్తి ప్రత్యక్షమై చిరునవ్వు నవ్వుతూ,—"ఓయి హాతిం. ప్రపంచమంతటా మహా పరోపకారి వని పేరు గడించుకున్న నువ్వు యీ తుచ్ఛమైన వజ్రాల పైని యింత మక్కువ చూపడం మంచిది కాదు. ఇతరుల వస్తువుల్ని దొంగలించావన్న అపనింద యెందుకు పడ్తావు చెప్పు. ఇలా అన్యా

యంగా దొరికిన వస్తువు లెప్పుడూ నీకు దక్కవు. అయితే నీ పరోపకార బుద్ధికి మెచ్చుకుని నీ కొక పచ్చనూ—ఒక వజ్రాన్నీ బహుమతిగా యిస్తున్నాను. నీ దగ్గరున్న వజ్రాల్ని యిక్కడే వదిలి పెట్టావంటే అవి మళ్ళీ నీకే దక్కుతాయి. లేదా ఆ జన్మాంతం చాలా దుఃఖపడ వలసి వస్తుంది. జాగ్రత్త" అంటూ హెచ్చరించి మాయమై పోయాడు.



అంతలో గభాల్న హాతింకి తెలివి వచ్చి మేలుకున్నాడు. ఆ నరసింహ మూర్తి చెప్పిన ప్రకారం ఆ వజ్రాల వల్ల తనకు మొప్పం కలుగుతుందనుకుని తన దగ్గర వున్న వజ్రాలన్నిటినీ నీట్లోకి విసిరి వేశాడు. మరుక్షణంలోనే ఆ నీట్లో నుంచి ఒక అందమైన కన్య బయటి కొచ్చింది. అతని కలలో నరసింహ మూర్తి చెప్పిన వజ్రం-పచ్చా ఆమె చేతిలో వున్నాయి. వాటి నామె హాతింకి అందిస్తూ,- "ఎప్పుడు చూసినా పరోపకారానికి జీవితాన్ని అంకితం చేసిన నీకు పరమేశ్వరుడి కరుణా కటాక్షం యెల్లప్పుడూ వుంటుంది. ఇక్కడికెందరెందరో వచ్చారు. వారిలో ముగ్గురు తప్ప మిగతా వారంతా యమలోకానికి చేరుకున్నారు. నీ వల్ల యింకా యెన్నెన్నో పరోపకార కార్యాలు జరగవలసి వున్నాయి కాబట్టి నువ్వు బ్రతికి పోయావు. ముందు ముందు కింకా నువ్వు చాలా మహా సముద్రాలు దాటవలసి వుంది. వాటిలో మొట్ట మొదట కనిపించేది బంగారు సముద్రం, దాన్ని దాటితే నీలి సముద్రం, దాని తర్వాత ఉప్పు సముద్రం. దాన్ని దాటి వెళ్లావంటే మీ తాలూకు ఎమెన్ దేశం కనిపిస్తుంది" అని చెప్పి ఆ నీట్లో అంతర్ధానమై పోయింది.

తర్వాత హాతిం అక్కణ్నుంచి ముందుకి నడిచి బంగారు సముద్రానికి చేరుకున్నాడు. అక్కడొక పడవ సిద్ధంగా వుంది. దానిపైకెక్కి హాతిం పది రోజులపాటు ప్రయాణం చేసి నీలి సముద్రం చేరుకున్నాడు. దాన్ని కూడా ఏడు రోజుల్లో దాటి ఉప్పు సముద్రానికి చేరుకున్నాడు. అయితే ఉప్పు సముద్రంలో పడవ అంతకు ముందే వెళ్లి పోయినందు వల్ల, హాతిం గట్టు పైని దిగి కొంచెం ముందుకి నడిచి వెళ్ళి అల్లంత దూరంలో నున్న వ్యాపారస్థుల ఓడపై కెక్కాడు. దాంట్లో వున్న యెమెన్ దేశపు వర్తకు లంతా హాతింని



గుర్తుపట్టి ఎంతో గౌరవంగా - మర్యాదగా సత్క రించారు.

వారికి తన యాత్రాగాథని వినిపిస్తూ ఆ ఓడలో కాలం గడిపాడు. ఎన్నాళ్ల నుంచో యెవరి సావాసమూ లేకుండా విసుగెత్తిపోయిన అతని హృదయానికిప్పుడు కాస్త నెమ్మది అనిపించింది. మరొక అయిదు రోజుల్లోకల్లా ఎమెన్ దేశం చేరుకున్నారు. అక్కణ్నుంచి హాతిం షహాబాదు కెళ్లి తన మిత్రుడు మునీర్‌ని ముందుగా కలుసుకున్నాడు. అతని యోగక్షేమాలవీ తెలుసుకుని అతణ్ని వెంట బెట్టుకుని హుస్నబాను దగ్గర కెళ్ళాడు. 'కోహ నిదా' అంటూ అరచే పర్వతం తాలూకు వృత్తాంతం ఆమెకి పూర్తిగా విశదీకరించాడు. హుస్నభాను అది విని యెంతో ఆనందించింది. హాతింని యెంతో ఆదరపూర్వకంగా గౌరవించింది.

అయితే యిక ఆరో ప్రశ్న యేమిటి?-"గోళీ కాయంత పెద్ద ముత్య మొకటి తన దగ్గర వున్నది. అలాంటిదే మరొక ముత్యం పట్టుకు రావాలి"—

సత్కార్యమేదయినా చేయడానికి అలస్యం పనికిరాదని హాతిం షహాబాదులో చానాళ్ళు వుండకుండా హుస్నభాను దగ్గర, మునీర్ దగ్గర సెలవు పుచ్చుకుని ఆరో ప్రశ్నకు తగు సమాధానం తెచ్చేందుకు బయలుదేరాడు.

నాలుగైదు రోజుల వరకూ అతను నడిచి వెళ్ళి సాయంకాల మవుతూ వుండగా ఒకకీకారణ్యానికి చేరుకున్నాడు. ఆ రాత్రి కక్కడే వుండి ఒక చెట్టు క్రిందను విశ్రాంతి తీసుకుందామని మెల్లగా సాగవారాడు. తన కార్యం నెరవేర్చుకుందుకి యెటు వెళ్లాలీ, యేం చెయ్యాలీ అని అతను ఒకటే ఆలోచనలో పడ్డాడు. అంతలో ఆ చెట్టుపై నున్న రాజ హంస దంపతు లేవో గుసగుస లాడుకోవడం వినిపించింది. అవి తన గురించే మాట్లాడు కుంటున్నాయని తెలుసుకుని హాతిం ఆతృతగా చెవులు నిక్కబెట్టి మరీ అలకించ సాగాడు. —

ఆడ హంస అంటుంది గదా,—"ఈ మన చెట్టు క్రింద నెవరో ఆసామీ పడుకున్నాడే!— ఆయన గురించి మీ కేమయినా తెలుసా?"

అందుకు మగ హంస,-"ఓ, తెలియకేం?

ఆయన హాతిం-ఎమెన్ దేశపు రాజకుమారుడు. ఆయన కీర్తి ప్రపంచమంతటా-దశ దిశలా వ్యాపించింది. ఇప్పు డాయన గోళీకాయంత పెద్దముత్యం కోసమని బయలుదేరాడు. కాని అదెక్కడ దొరుకుతుందో నని అతను విచారంగా వున్నాడు. అయితే ఆ ముత్యం సంగతి నాకు బాగా తెలుసులే" అన్నది.

అదేమిటో చెప్పమని అడిగింది ఆడు హంస.

"అయితే విను చెప్తాను. జగదీశ్వరుడు యీ సృష్టిని నిర్మించే శక్తి మొట్ట మొదట రాజ హంసలకే యిచ్చాడు. కాని యీ కలియుగంలో ఆ శక్తి నశించిపోయింది. అంతేగాకుండా మొట్ట మొదట్లో పుట్టిన ముత్యాలన్నీ సముద్రంలో మునిగి పోయాయి. రెండు ముత్యాలు మాత్రం ఈ ప్రపంచంలో వున్నాయి. అవి యెలా వుండి పోయాయో చెప్పాలంటే బోలెడు కథ వుంది. సప్త సముద్రాలూ దాటి వెళ్తే గంగాపురమనే పట్టణం ఒకటి వుంది. ఆ పట్టణంలో రాజ్య పరిపాలన చేస్తున్న మహారాజు పేరు సూర్యకాంతుడు. ఆ రాజు సముద్రనాథుణ్ని భక్తి పూర్వకంగా ప్రార్థించగా సముద్రనాథు డందుకు ప్రసన్నుడై రెండు ముత్యాల నతనికి బహుమతిగా యిచ్చాడు. సూర్యకాంతుడు వాటిల్లో ఒక ముత్యాన్ని తన ఆప్త మిత్రుడైన చంద్ర హంసుడనే అతనికి బహూకరించాడు. కానయితే ఒకసారి చంద్రహంసుడికీ-అతని శత్రువులకూ యుద్ధం జరిగి దాంట్లో చంద్రహంసుడు చచ్చిపోయాడు. అప్పుడా ముత్యం శత్రువుల చేతికి చిక్కింది. అది అలా ఒకరి చేతిలో నుంచి యింకొకరి చేతిలోకి మారుతూ ఆఖరికి బరర్షుఖాక్ వర్తకుడికి దక్కింది. అతగాడు చనిపోయేక అతని యేకైక పుత్రిక



హుస్నుబాను చేతికి చిక్కింది” అని చెప్పింది మగహంస—అంతలో ఆడ హంస వెంటనే అందుకుని, “అయితే యింతకూ ఆ రెండో ముత్యం యెవరి దగ్గర వుంది?” అంటూ అడిగింది.

అందుకా మగ హంస అన్నది గదా,—“సూర్యకాంతుడు చనిపోయేక శత్రువుల భయం కొద్దీ ఆయన భార్య ఆ ముత్యాన్ని పట్టుకుని అడవులకి పారిపోయింది. అలా వెళ్తా-వెళ్తా ఆమె సముద్ర తీరానికి చేరుకుంది. అక్కణ్నుంచి దారి కనిపించక పోవడంతో ఆమె విచారించుకుంటూ కూర్చుంది. అంతలో అక్కడి కొక షావుకారొచ్చాడు అతని పేరు కృపాసాగరుడు. అనేక విధాల ఆమె అతగాణ్ని ప్రార్థించి నందువల్ల అతని కామెపైని దయ కలిగింది. వెంటనే ఆమెని తన ఓడలో కెక్కించుకుని తన పట్టణానికి తీసుకెళ్లి పోయాడు.

అప్పటికే ఆమె గర్భవతి. కొన్ని నెలలయేక ఆమె కొక చక్కని కొడుకు పుట్టాడు ఆ అబ్బాయి పున్నమ చంద్రుడి లాగ దినదినాభివృద్ధిపొందుతూ పది హేడేళ్ళ ప్రాయపు యువకుడిగా పెరిగి, అరవై నాలుగు విద్యల్లోనూ ఆరితేరాడు. కృపాసాగరు డతణ్ని పెంచుకున్నాడు. తను పూర్వం మాండలీక రాజ్యానికి రాజుననీ, దురదృష్టవశత్తూ తన రాజ్యం శత్రువుల పాలైపోయిందనీ, తను ప్రస్తుతం వర్తకుడి వేషంతో వుండవలసి వచ్చిందనీ పూర్వవృత్తాంత మంతా వివరించి చెప్పాడు.

“అప్పుడా యువకుడు కొంత సైన్యాన్ని సమకూర్చుకుని కృపాసాగరుడి శత్రువులపై దండెత్తి ఓడించి మాండలీక రాజ్యాన్ని తిరిగి వశపరచుకున్నాడు. అంతే గాకుండా ఆ చుట్టుపట్ల వుండే చిన్న చిన్న రాజ్యాలను కూడా వశపరచుకుని చక్రవర్తి అనిపించుకున్నాడు. ఆ సమయాని కతని తల్లి మరణించడం వల్ల ఆమె దగ్గరవున్న ముత్యం అతని చేతికి చిక్కింది. ఇలా వుంటూ వుండగా కొన్నాళ్ల కొక గంధర్వకన్య ఇతణ్ని ప్రేమించి కొన్ని రోజులితనితో కాపురం చేసింది. మంచి అదను చూసుకుని ఆమె అతణ్ని మోసగించి ఆ ముత్యాన్ని కాస్తా చేజిక్కించుకుని వెళ్ళి పోయింది. ఆ ముత్యం యిప్పుడామె కొడుకయిన విరూపా

కూడి దగ్గర వుంది. అతనే యిప్పుడు బరటూక్ రాజ్యానికి మహారాజు;—

"అతడికి పన్నెండేళ్ల కూతురొకామె వుంది. ఆమె పెళ్లికై అతనొక దండోరా వేయించాడు. "నా దగ్గర వున్నటువంటి విడ్డూరమైన ముత్యం తాలూకు పూర్వాపర సందర్భాలు చెప్పే అతనికి నా కూతుర్నిచ్చి పెళ్లి చెయ్యడమే గాకుండా, ఈ రాజ్య మంతటినీ వర కట్నంగా చదివించుకుంటాను" అని చాటించాడు.

"అందుకని ప్రియురాలా, కలియుగం ప్రవేశించి నందువల్ల అలాంటి ముత్యం సంగతి విరూపాక్షు డొక్కడికే తెలుసు. అతను కూడా దివ్యదృష్టి వల్ల కనుకున్నదే!—దివ్య దృష్టి వున్న వారికి జరిగిందీ, జరుగుతున్నదీ, జరుగబోయేదీ కూడా యిట్టే తెలుస్తుంది.

ఇంత గొప్ప సంగతి నీకు చెప్పడం వల్ల ప్రయోజనమేదీ లేదు కాని ఇతరుల దుఃఖాలు పోగొట్టేందుకి నిరంతరం పాటు పడ్తున్న హాతింకి యెంతో వుపయోగ పడ్తుంది లే"—

మగ హంస చెప్పిన యీ కథంతా విన్న మీదట, ఆడ హంస ఆతృతగా,—"అయితే ఏమండీ, ఇంతవరకూ యేదో చెప్పారు. సరే, కాని ఆ బరటూక్ నగరం ఎటో, అక్కడికెళ్లేందుకు దారెలాగో చెప్పారు కారు!—అంతే గాకుండా అక్కడి కెళ్ళే దార్లో మనుషుల్ని చంపుకుని తినే రాక్షసు లెంతో మంది వుంటే ఎలా వెళ్ళడం?" అంటూ అడిగింది.



"ఇక్కణ్నుంచి ఉత్తరానికి ఒకటి-రెండు నాళ్ళు నడిచి వేళ్తే ఒక పెద్ద పర్వతం కనిపిస్తుంది. అక్కడ క్రూర జంతువుల బాధ, రాక్షసుల పీడ యెక్కువ. దానికి తట్టుకోవాలంటే ఒకే ఒక వుపాయముంది.

నేనీ పక్కనున్న కొన్ని ఆకుల్ని తెంపి క్రిందను పడవేస్తున్నాను. వాటి చుట్టూ మరి కొన్ని పసుపు పచ్చ ఆకుల్ని చుట్టి కాల్చి బూడిద చెయ్యాలి. ఆ బూడిదను నీట్లో కలుపుకని స్నానం చెయ్యాలి అలా చేస్తే యితను రాక్షసుడిగా మారిపోతాడు. శరీరమంతా కుళ్లు కంపు కొడ్తుంది. అప్పుడు మిగతా రాక్షసులూ-క్రూరమృగాలూ యేవీ అతని దరిదాపులకి కూడా రావు. అడవి దాటి, రాక్షసుల ప్రదేశం దాటి బరటూరొక నగరం చేరగానే, మళ్లీ మళ్లీ

మామూలు ఆకుల్ని నీట్లో కలిపి స్నానం చేస్తే యథా రూపం వస్తుంది. ఆ నగరాని కెళ్లి విరూపాక్షుడికి నేను చెప్పిన వృత్తాంతమంతా వివరంగా చెప్పినట్టయితే, ఆయన తన కూతుర్ని యితనికే యిచ్చి పెళ్లి చేసి ఆ ముత్యాన్ని చల్లగా సమర్పించుకుంటాడు భగవంతుడి పరిపూర్ణమయిన దయ ఇతని పట్ల వున్నందు మూలాన నేను చెప్పినట్టు చేసుకుంటే ఇతనికి విజయం కలగడం ఖాయం" అని చెప్పి ప్రాతః కాల మవుతున్నందువల్ల తన ప్రక్క నున్న ఆకులు కొన్నిటిని తెంపి క్రింద పడవేసి ఆ మగ హంస తన ప్రియురాలితో రివ్వున పైకి యెగిరి పోయింది.

ఆ రాజ హంస దంపతులు మాట్లాడుకున్న సంగతులన్నీ వినీ పరమానంద పడ్డాడు హాతిం. అవి చేసిన యీ మహోపకారం తలంచుకుని, దైవాన్ని స్మరించుకుని అక్కడున్న పండు టాకులూ - యెండు టాకుల్నీ పట్టుకుని అక్కణ్ణుంచి బయలుదేరాడు. సాయింకాలం వరకూ అలా కాలి నడకను ప్రయాణం చేసి దార్లో ఒక చెట్టు క్రిందను విశ్రాంతి కోసమని మజిలీ చేశాడు.

అర్ధ రాత్రయింది. అంతలో యెక్కణ్ణుంచో పెద్ద అరుపు హాతింకి వినిపించింది. "ఈ కష్ట కాలంలో సహాయం చేసే పుణ్యశాలి ఈ ప్రపంచంలో ఒక్కరూ లేరా ?" అంటూ యేడుస్తూ యెవరో యెక్కడో దీనంగా యేడుస్తున్నారు——ఒక దానికి బయలుదేరితే యింకొకటి తయారు!—ఇదేమిటి చెప్మా అని ఆలోచించాడు హాతిం !—

(ఇంకా వుంది)





["గోళీకాయంత పెద్ద ముత్య మొకటి తన దగ్గర వున్నది. అలాంటిదే మరొక ముత్యం పట్టుకు రావాలి'' ఇదీ హుస్నభాను హాతిం కిచ్చిన ఆరో సమస్య. ఆ రెండో ముత్యం తాలూకు వృత్తాంతాన్ని హాతిం రాజహంస దంపతుల ద్వారా తెలుసుకుని బయలుదేరాడు. అర్ధ రాత్రి వేళ అతని కొకచోట 'ఈ కష్ట కాలంలో సహాయం చేసే పుణ్యశాలి ఈ ప్రపంచంలో ఒక్కరూ లేరా ?'' అనే యేడుపు వినిపించింది.]

వెంటనే హాతిం ఆ ధ్వని వస్తున్నవైపు నడక సాగించాడు. అలా కొంత దూరం వెళ్లేసరికి ఆడ కోతి ఒకటి 'అలో లక్ష్మణా' అని యేడుస్తూ వుండడం అగుపించింది. హాతిం దాని దగ్గర కెళ్లి "ఏమిటి? ఎందుకేడుస్తున్నావు? " అని అడిగాడు. అందుకా కోతి తన భర్తనూ, ఆరుగురు పిల్లల్నీ ఎవడో వేటగాడు లాక్కుని వెళ్లి పోయాడనీ, అందుకే యేడుస్తున్నాననీ చెప్పింది.

అప్పుడు హాతిం ఆ వేటగాడుండే చోటు తనకు చూపిస్తే ఏదో వుపాయం మీద ఆ కోతి భర్తనూ పిల్లల్నీ విడిపించి తెస్తానన్నాడు. కాని అందుకా ఆడకోతి యేమన్నదో తెలుసా?- "అయ్యో, నువ్వు ఆ వేటగాడి లాంటి మోస గాడి వేమో!-ఇప్పుడు నీ వెంబడి వచ్చానంటే నువ్వుకూడా నన్ను మాయజేసి తీసుకెళ్లిపోతా వేమో!- ఇలా లోగడ ఒకమారు జరిగింది- అందుకే నాభయం"

అది విని హాతిం అటువంటి మోసమేమీ జరగదని అభయ మిచ్చాడు ఆ యాడ కోతి కూడా దేవుడి పైని భారం వేసి అతని వెంబడి బయలుదేరింది. హాతిం వేటగాడి యింటి దగ్గరగా వెళ్లి ఆడకోతి నొక మూల దాచిపెట్టి తను యింటి లోపలి కెళ్లాడు. ఎవరో యాత్రికుడి వేషంలో వున్న హాతింని చూసి వేటగాడు ఆదర పూర్వకంగా అతిథి సత్కారం చేసి,- "తమకేం కావాలండీ?" అంటూ అడిగాడు.

అందుకు హాతిం అన్నాడు గదా,-"అయ్యా నేను ఎమెన్ దేశపు వ్యాపారస్థుణ్ని. యెన్నాళ్లు గానో సంధివాతంతో సతమతమై పోతున్నాను. అందుకు కోతి నెత్తురుతో స్నానం చేస్తే మంచి గుణమిస్తుందని తెలిసింది. మీదగ్గర కోతులేవయినా వుంటే మీరడిగిన వెల యిచ్చుకుంటాను. దయచేసి మీ దగ్గరవుండే కోతులన్నిటినీ యివ్వాలి"

"అలాగయితే మీవంటి గొప్పవారికి సరి పోయే వెల యిచ్చుకోగల కోతులు నా దగ్గర వున్నాయి. ఒకటేమో పెద్దకోతి-ఆరు చిన్న పిల్లలు-అవన్నీ యిప్పుడే మీకప్పగిస్తాను" అన్నాడా వేటగాడు ఆనందంగా—

అనడమేగాదు!-వెంటనే ఆ యేడు కోతుల్నీ హాతింకి ఆ క్షణంలో అప్పగించి వేశాడు. అందుకు హాతిం వాడికి పది వరహా లిచ్చాడు. తర్వాత ఆ కోతులన్నిటినీ వెంటబెట్టుకుని ఆడ కోతి దాక్కున్న దగ్గరకొచ్చి దానికి మగకోతినీ, ఆరు పిల్లల్నీ అప్పగించాడు. ఆ పిల్లలు

రచన: "బాలమిత్ర"



అమ్మని చూడగానే ఆనందంగా-ఉల్లాసంగా మీద పడి ఆడుకుంటూ పాలు త్రాగడం మొదలెట్టాయి. పాపం మగకోతి నా పాపిష్టి వేటగాడు తాడుతో బిగువుగా కట్టి వుంచడం వల్ల దాని గొంతుక తెగి, అఖరికి చచ్చే పరిస్థితి కొచ్చింది. అది చూసి ఆడకోతి గబ గబా హాతిం దగ్గరకు పరుగెత్తు కొచ్చి, -"అయ్యా, మీరు నాభర్త చెర విడిపించి నాకప్పగించారు అందుకు నేను మీకెంతో రుణపడ్డాను. ఐతే యిప్పుడాయన గొంతుక తెగి, యిప్పుడు చనిపోయే స్థితిలోపడి కొట్టుకుంటున్నాడు అయన్ని కాపాడాలంటే ఒక చిన్న పళ్లెం నిండా మనిషి రక్తం తెచ్చి అయనచేత త్రాగించాలి. అందువల్ల మా మీద దయవుంచి ఆ రక్తం దానం చేశారంటే ఎంతో మేలు చేసిన వారవుతారు." అని చెప్పింది.

ఆడకోతి ఆర్తనాథం వినగానే హాతిం గుండె కరిగిపోయింది వెంటనే ముందూ వెనకా ఆలోచించకుండా తన చేతినే గబుక్కున కోసి ఒక చిన్న పళ్లెం నిండా రక్తాన్ని తీసి యిచ్చాడు. ఆడకోతి ఆ రక్తాన్ని మగకోతికి పట్టింది. దాంతో వెంటనే దానికి నయమయి మామూలుగా లేచింది. ఆకోతి దంపతులు రెండూ హాతింకి సాష్టాంగపడి నమస్కరించి అతను చేసిన ఉపకారాన్ని కొనియాడి తమ దారిని వెళ్లిపోయాయి. ఇక హాతిం తన చేతికి కట్టు కట్టుకుని తన ప్రయాణం ముందుకి సాగించాడు.



కొంత దూరం అలా వెళ్లేసరికి హాతిం కొక పెద్ద యెడారి యెదురయింది. ఆ యెడారిలో నడిచి పోతూ వుంటే అతనికి అపరిమితమైన దాహం వేసింది. ఆ సమీపంలో ఒక పెద్ద నుయ్యి వుంటే, నీరు త్రాగుదామని అక్కడికెళ్లాడు. కాని తీరా చూస్తే ఆ నూతిలో పెద్ద భయంకరమైన నాగుపామొకటి అడ్డంగా వున్నది. దాన్ని చూసి భయపడ్డాడు హాతిం. అది కనిపెట్టి ఆ పాము మానవ భాషలో,—"ఓయి హాతిం-మరేం భయపడకు. నిరభ్యంతరంగా నీళ్లుత్రాగి నీ దాహం తీర్చుకో-ఆ తర్వాత నా పడగ క్రిందికి రా" అని పిలిచింది.

అది వినేసరికి హాతిం కెంతో ఆశ్చర్యమనిపించింది. అయినా దేవుణ్ని ధ్యానించుకుని









నూతిలో నీరు త్రాగి ఆ పాము పడగ క్రింది కెళ్లి నిల్చున్నాడు. మరి కొంత సేపట్లోనే వారిద్దరూ ఒక రమ్యమైన పూలతోటకి చేరుకున్నారు. ఆ పూలతోటలో కూర్చునేందుకు అందమయిన పాలరాతి అరుగు లెన్నో వున్నాయి. అక్కడే ఒక అరుగు పైని హాతింని కూర్చోమని చెప్పి ఆ సర్పం ప్రక్కనే వున్న ఒక పొదలో దూరి మాయమై పోయింది.

ఆ విడ్డూర మేమిటో గదా అని హాతిం అటు కళ్లు వెళ్లబెట్టి నిర్ఘాంతపడి చూస్తున్నంతలోనే, రతీదేవి అందాన్ని మరపించే అపరూప సౌందర్యం వుట్టిపడే గంధర్వకన్య లనేక మంది ఆడుతూ పాడుతూ ఆ పొదలోనుంచి బయటి కొచ్చారు. ప్రతి యువతి చేతిలోనూ



రత్నాలతో నిండి వున్న బంగారు పళ్లెం ఒక్కొక్కటి వున్నది. వారంతా ఆ పళ్లేలన్నిటినీ హాతిం ముందు వుంచి చేతులు జోడించి,- "అయ్యా పామురూపంలో నున్నది మా మహారాజు. అదృష్ట వశాత్తుగా మీ దర్శనం లభించింది. దాంతో వెంటనే యెంతో కాలం నుంచి వుంటున్న ఆయన భయంకర మైన పాము రూపం పోయి మనిషిగా మారి పోయాడు. అందుకోసమని ఈ ముత్యాలనూ-రత్నాలనూ మీకు కానుకగా సమర్పించు కుంటున్నాం. దయచేసి స్వీకరించండి స్వామీ" అంటూ వేడుకున్నారు.

"అమ్మాయిలూ, ఈ కానుకలు పంపిన మీ రాజుగారికి నేనెంతో కృతజ్ఞుణ్ని. అయితే వీటి వల్ల నాకేమీ ప్రయోజనం లేదు." అన్నాడు హాతిం-

అంతలో మరికొంత మంది అందాల కన్యలు బలే బలే రుచికరమయిన ఫలహారాల తబుకులన్నీ పట్టుకొచ్చి ఆయన ముందు నిలబడి, వాటిని ఆరగించమని వేడుకున్నారు వాటిని కూడా హాతిం నిరాకరించాడు. "వాటిని పంపిన గృహస్థులంతా యిక్కడ వుంటూ వుండగా, నేనొక్కణ్నే తినడం విరుద్ధం" అన్నాడు.

మరి కొన్ని నిముషాలకు సర్వాలంకార భూషితుడయిన సుందరాకారొ డొకతను హాతిం దగ్గర కొచ్చాడు. అతని అందం చూస్తే మన్మథుణ్ని కూడా మించిపోయేటట్టుగా






వున్నది. అతనూ-హాతిం పరస్పరం నమస్కరించుకున్నారు. ఇద్దరూ కులాసా కబుర్ల లోకి దిగారు. మాటల సందర్భంలో "మీకీ పాము రూపు యెలా వచ్చింది మహరాజా?" అంటూ అడిగాడు హాతిం.

"అదంతా ఒక పెద్ద కథ లెండి. మీరు మార్గాయాసంతో వున్నారు. ముందు స్నానం చేసి భోంచేయండి. తర్వాత నా కథేమిటో చెప్తాను" అన్నాడా గంధర్వరాజు.

ఇద్దరూ కులాసాగా భోంచేశారు. తర్వాత గంధర్వరాజు తన కథ నిలా చెప్పడం మొదలెట్టాడు,—

"ఒకప్పుడు నేనుగంధర్వరాజుసేనాపతిని, వీరసింహుణ్ని. ఒకనాడు నేను ఉద్యానవనంలో విహరిస్తూ వుండగా నాలో చిన్న కుయుక్తి బయల్దేరింది. నే నింత పరాక్రమవంతుణ్నయి వుండి కూడా ఎవరో ఒక మహారాజు క్రిందను తాబేదారుగా వుండడం నాకెంత అవమానం? - అందుకని యీ మహరాజు నెలాగయినా హతమార్చి నేనే ఆ సింహాసనాన్ని లాక్కొని మహారాజును కావాలి అనుకున్నాను. వెంటనే నాక్రింద వుంటున్న సైన్య మంతటినీ పోగుచేసి రాజు గారి పైనే అమాంతంగా దండెత్తి విరుచుకు పడ్డాను. అవతల మహరాజు చూస్తే బలే మంత్రగాడు ఆయన నాపైని కోపంతో నిప్పులు కక్కుతూ, - "ఒరేయ్ నీచుడా, నా వుప్పు తింటూ నాకే యెసరుపెట్టాలని చూస్తున్నావా? ఇదుగో - నిన్నేం చేస్తానో చూడు" అంటూ మమ్మల్నందర్నీ పాము లయ్యేటట్టు శపించి వేశాడు. దాంతో మేమంతా పాములమయి పోయాం. నేను చేసిన పనికి నాకే యెంతో విచార మనిపించింది. అయినా చెయ్యి దాటి పోయేక పశ్చాత్తాపపడి ప్రయోజన మేముంది?

అలాగే పాముగా అడవులన్నీ తిరుగుతూ వుండగా ఒక సన్యాసి నాకు కనిపించాడు.





ఆ మహానుభావుడు దివ్యదృష్టితో నా దుర వస్థను తెలుసుకుని, 'నీ రాజద్రోహిని కిదే తగిన శిక్ష' అన్నాడు-ఆ ఫలంగా నేనాయన కాళ్లపైని బడి క్షమించమని మొరపెట్టుకున్నాను. అప్పుడాయన నాపైని కనికరం తలచి,—"నువ్విదే రూపంతో మూడేళ్లు తిరిగిన తర్వాత ఎమెన్ దేశపు పరోపకారి రాజు హాతిం దర్శనం అవుతుంది. ఆయన దర్శన భాగ్యంతో నీకూ-నీ సైనికులకూ పూర్వపు గంధర్వ రూపం తిరిగి సంప్రాప్తిస్తుంది" అంటూ ఆశీర్వదించాడు. అందువల్ల యిప్పుడు తమ దర్శన భాగ్యంతో నాకూ-నా సైనికులకూ మీ రుణం ఎలా తీర్చుకోవాలో తెలియకుండా వున్నది. మీకు ఎలాంటి సహాయం కావాలన్నా చేస్తాం. మీ మేలెన్నటికీ మరచిపోలేం-మీరు వెళ్తున్న బరఘొక్ దేశం దారిలో ఎన్నెన్నో రాక్షస రాజ్యాలున్నాయి. వాటిని దాటుకుంటూ వెళ్ళేటప్పుడు అక్కడి రాక్షసులు మిమ్మల్ని విపరీతమైన బాధలు పెడ్తారు. అందుకని మీతోబాటు సమకస్థులయిన నలుగురు సైనికుల్ని పంపిస్తాను. మీ ప్రయాణంలో ఎలాంటి కష్టం యెదురయినా వారు మిమ్మల్ని కాపాడ్తారు" అన్నాడు.

మొదట్లో హాతిం వద్దు అక్కర్లేదన్నా ఆఖరికి వీరసింహుడి బలవంతం మీద ఒప్పుకొన్నాడు. మధ్య దార్లో యే కష్టం వచ్చినా తనకొచ్చి చెప్పినట్టయితే దాన్ని గట్టెక్కించడానికి తను ప్రయత్నిస్తానని భరవసా యిచ్చి తన సిపాయిల్ని హాతిం వెంట పంపించాడు.

వీరసింహుడి దగ్గర సెలవు పుచ్చుకొని హాతిమూ, ఆ సిపాయిలూ అక్కణుంచి బయల్దేరి వెళ్లిపోయారు. పూర్తిగా ఒక నెల రోజులు నడిచి రాక్షసులుండే ప్రాంతానికి చేరుకున్నారు. అక్కడికి వచ్చేసరికి వారికి బలే దాహం వేసింది. ఆ చుట్టుపట్ల చూస్తే నీటి జాడే లేదాయెను!—అందువల్ల సిపాయిలు తమలో యిద్దర్ని హాతిం సంరక్షణ కోసం అట్టే పెటి, యిద్దరు నీళ్ళు వెతికి పట్టుకొచ్చేందుకెళ్లారు.

కొంతసేపటికి అక్కడికి కొంతమంది రాక్షసులు వచ్చారు. అది చూసి గభాల్న హాతిం, అతనితో వున్న యిద్దరు సిపాయిలూ తమ



తమ కత్తులు పట్టుకుని నిలబడ్డారు. వారికీ వీరికీ చాలాసేపు పోరాటం నడచింది. దాంట్లో కొంతమంది రాక్షసులు గాయపడ్డారు. మరి కొందరు చచ్చిపోయారు. అయినా ముచ్చయి ముగ్గురు మనవాళ్ళు ఎంత సేపని ఆ రాక్షసు లందరితోనూ తెరిపి లేకుండా యుద్ధం చేయ గలరు?-అందుకని కొంత సేపట్లోనే ముగ్గురూ మూర్ఛపోయారు. మిగతా రాక్షసులు ఈ ముగ్గుర్నీ విరిచి కట్టి యెత్తుకుని తమ రాజు గారి దగ్గరకు తీసుకెళ్లారు. అక్కడ ముగ్గురికీ తెలివి వచ్చింది. రాక్షస రాజు ఆ గంధర్వ సిపాయిల్ని చూసి "మీరెవరు?—ఈ అసామీ నెక్కడ్నుంచి పట్టుకొచ్చారు" అంటూ అడిగాడు.



అందుకా గంధర్వ సిపాయిలు,-"ఇతను ఎమెన్ దేశపు యువరాజైన హాతిం - మేమి ద్దరం వీరసింహుని సిపాయిలం, ఇతని సహా యం కోసం వచ్చాం. నువ్వీ పుణ్యాత్ముడి వళ్ళు ముట్టుకున్నావంటే చూసుకో-నీ అయు ర్దాయం యిక్కడే తీరిపోతుంది" అంటూ గర్జించారు.

ఇది వినగానే రాక్షస రాజు కెక్కడా లేని కోపం వచ్చిపడింది. "ఈముగ్గుర్నీ యిప్పుడే బంధించి ఖైదులో పెట్టండి" అంటూ ఆజ్ఞా పించాడు. సేవకులలాగే ముగుర్నీ బంధించి చీకటి కొట్లోకి త్రోసివేశారు

ఇక్కడ నీటికోసం వెళ్లిన గంధర్వ సిపాయి లిద్దరూ తిరిగి వచ్చి అక్కడ చచ్చి పడి వున్న రాక్షసుల్ని చూసి బెంబేలెత్తిపోయారు. ఆ పడి వున్న రాక్షసులలో యింకా కొనవూపి రితో వున్న ఒక అసామిని లేపి సంగతి సమా చార మేమిటని తడిగారు. వాడు జరిగిన వృత్తాంత మంతా చెప్పి ప్రాణాలు వదిలాడు. అదివిని యిక యీ రాక్షసరాజును తామిద్దరు యెదిరించడం సాధ్యముయ్యే పని కాదని వారు తమ రాజు వీరసింహుడి దగ్గర కెళ్లి యీ వర్త మానం చెప్పారు వీరసింహుడు కోపావేశంతో మండి పడ్తూ, తన సేనలన్నిటినీ వెంటబెట్టు కుని రాక్షసరాజు పైని దండెత్తాడు. హాతింనీ అతనితో వున్న యిద్దరు సిపాయిల్నీ మర్యా దగా తన కప్పగించినట్టయితే వారి నగరాన్నీ, అక్కడి రాక్షస వంశాన్నీ పూర్తిగా నాశనం







చేయకుండా వదలి పెడ్తానని రాక్షసరాజుకి కబురు పంపించాడు వీరసింహుడు. రాక్షస రాజు వెంటనే హాతింనీ అతనితో వున్న సిపాయిల్నీ విడుదల చేసి వీరసింహుడి క్షమాపగించాడు. తను చేసిన తప్పు క్షమించమని వేడుకున్నాడు.

అయినా వీరసింహుడు "రాక్షసుల పైని దయ చూపడం తెలివితక్కువతనం— వారెక్కడ వున్నా రాక్షసులే—అందుకని ఇతగాణ్ని భగ భగ మండే మటం లోకి త్రోసి కాల్చి వేయండి" అంటూ ఆజ్ఞాపించాడు. మరి కొంతసేపట్లో పాపం ఆ రాక్షసరాజు మంటలో భస్మమయిపోయాడు—తర్వాత వీరసింహుడు తమ గంధర్వు డొకణ్ని ఆ రాజ్యానికి రాజుగా చేశాడు. తన మాయ ద్వారా విమానం ఒకటి నిర్మించి దాంట్లో హాతింని, అతణ్ని కనిపెట్టుకుని వుండేందుకు యిదవరకటి నలుగురు గంధర్వ సిపాయిల్నీ కూర్చోబెట్టి బరతూక్ నగరానికి పంపించాడు.

ఆకాశ మార్గంలో ఆ విమానం రోజల్లా యెగురుతూ వెళ్లింది. అప్పుడు హాతిం విశ్రాంతి తీసుకోవాలని విమానాన్ని ఒక పర్వతం క్రిందను దించమన్నాడు. విమానం క్రిందికి దిగింది. ప్రక్కనే ఒక నది పారుతూ వున్నది. ఆ నదిలో స్నానం చేస్తూవుండగా హాతింకి దూరంగా యెవరో యేడుస్తున్న యేడుపు వినిపించింది. అదేమిటి చెప్మా అని ఆ యేడుపు వినిపించే తట్టుకు నడిచి వెళ్లాడు. కొంత దూరంలో గంధర్వ యువకు డొకతను యేడుస్తూ వుండడం కనిపించింది. హాతిం తనను ముందుగా పరిచయం చేసుకుని తన ప్రయాణ లక్ష్యాన్ని వివరించాడు. తర్వాత ఆ గంధర్వయువకుణ్ని "ఎందుకయ్యా ఏడుస్తున్నావు?" అంటూ అడిగాడు. (ఇంకా వుంది)



["గోళీకాయంత పెద్ద ముత్యమొకటి తన దగ్గర వున్నది. అలాంటిదే మరొక ముత్యం పట్టుకు రావాలి." ఇదీ హుస్నభాను హాతిం కిచ్చిన ఆరో సమస్య. ఆ రెండో ముత్యం తాలూకు వృత్తాంతాన్ని హాతిం రాజహంస దంపతుల ద్వారా తెలుసుకుని బయలు దేరాడు. వీరసింహు డనే రాజుగా రిచ్చిన విమానంలో అతను ప్రయాణించాడు. దార్లో అతని కొక గంధర్వ యువకుడు ఏడుస్తూ వుండడం కనిపించింది. అందు కతణ్ని కారణ మడిగాడు హాతిం.]

అందుకాగంధర్వ యువకుడిలా అన్నాడు, "నే నొకనాడు దర్బార్లో కూర్చున్నాను. అప్పుడు బరఖ్జోక్ నగరం రాజు తాలూకు కుమార్తె అందచందాల ప్రసక్తి వచ్చింది. ఆమె సౌందర్యాన్ని వర్ణించడం విని ఆమె నెలాగయినా పెళ్లి చేసుకోవాలనే వుబలాటంతో ఆ నగరాని కెళ్లాను. ముందుగా మహారాజుని కలుసుకుని నా కోరికను తెలియజెప్పాను. అప్పు డాయన పెద్ద సభ గావించి, దాంట్లో ఆ ముత్యం తాలూకు మూల గాథ ఏమిటో చెప్పమని నన్నడిగాడు. నా కది తెలియదు మరి! అందుకని నిరాశతో వెనక్కి తిరిగి యిక్కడ కూర్చుని యిలా శోకిస్తున్నాను." హాతిం అతగాణ్ని బుజ్జగించి వోదార్చి, — "గంధర్వ కుమారా, దిగులు పడకు. నేను కూడా అదే పని మీద బయల్దేరాను. దాంట్లో గెలిచా నంటే, ఆ అందాల సుందరి నీ యిల్లా లవుతుంది. పద, నాతో ఆ నగరానికి" అని చెప్పి అతణ్ని తన వెంట తీసుకుని పయనమయాడు. మళ్లీ విమానంలో కూర్చుని ఆకాశ మార్గంలో వెళ్లి పోయాడు. దార్లో మరొక గమ్మత్తు జరిగింది. ఆకాశంలో విమానం వెళ్లిపోతూ వుంటే దాన్ని క్రిందికి పడగొట్టా డొక రాక్షసుడు. దాంట్లో వున్న గంధర్వ కుమారుణ్ని గుర్తించినా మానవమాత్రుడైన హాతింని మాత్రంవదిలిపెట్ట నని పట్టుపట్టి కూర్చున్నాడు. అప్పుడు గంధర్వ యువకుడు తను తలపెట్టిన కార్యం నెరవేరాలంటే ఆయన ముఖ్యంగా తనతో వుండాలని ఆ రాక్షసుణ్ని బ్రతిమాలుకున్నాడు ఆయనకి బదులు పదిమంది మనుషుల్ని తనకు తీసుకొచ్చి అప్పగిస్తే హాతింని వదిలి పెడ్తానని రాక్షసు డన్నాడు. అలాగే నని వాగ్దానం చేశాడు. గంధర్వ యువకుడు వాగ్దానమయితే చేశాడు గాని ఆ రాక్షస ప్రదేశంలో మనుషుల్ని ఎక్కణ్నుంచి తెస్తాడు?-అందుకని రాక్షసుడి కిచ్చిన వాగ్దానం నెరవేర్చడం అసాధ్యం. అందుకని హాతింని యెలాగయినా రాత్రిపూట అపహరించి తీసుకుని వెళ్లి పోవడమే ఉత్తమమని ఆలోచించాడు గంధర్వ

రచన : "బాలమిత్ర"

యువకుడు. వెంటనే ఆ రాక్షసుడి దగ్గర సెల వ్పుచ్చుకుని,-"నేను అయిదు రోజుల్లో తిరిగి వస్తాను. నేను వచ్చేవరకూ హాతింని ఖైదులో పెట్టకుండా అతని యిష్టప్రకారం తోటలోనే ఒంటిగా వుంచాలి" అని చెప్పి వెళ్లిపోయాడు. అత నింకెక్కడికీ వెళ్లకుండా రాత్రి అయే వరకూ తోట సమీపంలోనే ఒక యింట్లో వుండి, అర్ధరాత్రి కాగానే లేచి తోట దగ్గరకు నింపాదిగా వచ్చాడు. కాపలా వాళ్లంతా నిద్ర పోతున్నారు. ఆ సమయం కనిపెట్టి గంధర్వ యువకుడు చడీ-చప్పుడూ చెయ్యకుండా తోటలో ప్రవేశించి హాతింని తీసుకుని విమానంలో వుంచి అతి వేగంగా అక్కణ్నుంచి పయనమై పోయాడు. రాక్షసు డయిదురోజుల వరకూ గంధర్వ కుమారుడు వస్తాడేమోనని యెదురు చూశాడు. కాని యింతకూ రాలేదు. అంతకూ రాలేదు. తోటలో కెళ్లి చూస్తే హాతిం కూడా కనిపించలేదు. హాతిం పరారీ అయి పోయినట్టు తెలుసుకుని, అందుకు తన సేవకులే కారకులని వారిని దండించాడు

అక్కడ విమానంలో వెళ్లిపోతున్నగంధర్వ కుమారుడికీ. హాతింకీ దార్లో మరొక మహా బలవంతుడైన రాక్షసరాజు తారస పడ్డాడు. వాడి బారినుంచి తప్పించుకోవడం చాలా కష్టమని గంధర్వకుమారుడు చెప్పాడు. అప్పుడు హాతిం ఆలోచించాడు. రాజహంసలు చెప్పిన మాటలు తక్కున తలంపు కొచ్చాయి.



అవి యిచ్చిన పండుటాకులూ-ఎండుటాకులూ బయటకు తీశాడు. పండుటాకుల్ని బూడిద చేసి దాన్ని వంటికి పూసుకుంటే తనకు రాక్షస రూపం వస్తుందన్నాడు.

'అయితే మీరు రాక్షసరూపం ధరించి ఎవరికీ కనిపించకుండా రండి. నేను రహస్య మార్గం గుండా వస్తాను. ఈ రాజ్యం దాటేక యిద్దరం కలుసుకుందాం." అని హాతింకి చెప్పి గంధర్వకుమారు డక్కణ్నుంచి వెళ్లి పోయాడు.

తర్వాత హాతిం రాజహంస లిచ్చిన పండు టాకుల్ని బూడిద చేసి నీట్లో కలిపి ఆ నీటితో స్నానం చేశాడు. వెంటనే అతనికి రాక్షస దేహం వచ్చింది. ఆ రూపంతో హాతిం రాక్షస



రాజ్యంలో అడుగు పెట్టాడు. అతను గూడా రాక్షసుడి లాగే కనిపించినందువల్ల ఆ రాజ్యంలో యెవరూ అడ్డగించ లేదు. ఎలాగో ఆ రాజ్యం దాటి అవతలి కెళ్లే సరికి అక్కడ హాతింని కలుసుకున్నాడు గంధర్వ కుమారుడు. వారిద్దరూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ వుంటే అది పసిగట్టి రాక్షసు డొకడు అక్కడి కొచ్చి పడ్డాడు. అదిచూసి గంధర్వ కుమారుడు గబుక్కున తన మంత్ర ప్రభావం వల్ల మాయమై పోయాడు. హాతిం రాక్షస రూపంతోనే వున్నందువల్ల అతనెవరో రాక్షసుడే ననుకుని వెళ్లిపోయాడా రాక్షసుడు. కొంత సేపటికి హాతిం లేచి చూశాడు. బాగా చీకటి పడింది. అక్కణ్నుంచి చాలా దూరం వెళ్లి పోయి గంధర్వకుమారుణ్ని కలుసుకున్నాడు. అక్కడ ఎండుటాకుల్ని బూడిదచేసి, అది కలిపిన నీటితో స్నానం చేశాడు. వెంటనే అతనికి మామూలు రూపు వచ్చింది ఈ అద్భుతాన్ని చూసి గంధర్వకుమారుడికి బలే ఆశ్చర్యం వేసింది. “శెబాష్, మహానుభావా, మీ యీ వేషంతో యింత మహా బలవంతమైన రాక్షస రాజ్యం నుంచి యెలాంటి అటంకమూ లేకుండా తప్పించుకుని రావడం సాధ్య పడింది. యింతటి గొప్ప మహాత్యం గలిగిన వరమిచ్చిన ఆ రాజహంస దంపతుల్ని నిజంగా మెచ్చుకోవాలి” అంటూ గంధర్వకుమారుడన్నాడు.

హాతిం, అతనితోబాటు వెళ్తూ వుండగా దార్లో వారికి యేడు సముద్రాలూ కలిసేచోటు కనిపించింది. వాటిని దాటడం యెలా చెప్మా అని విచారంలో పడ్డాడు హాతిం. అంతలో గంధర్వకుమారు డందుకుని అక్కడికి దగ్గరగా వుండే ఒక నగరంలో యేడు సముద్రాలనూ దాటించే గుర్రాలు దొరుకుతాయని చెప్పాడు. వెంటనే అత నక్కణ్నుంచి వెళ్లి మర్నాడు ఆ నగరం నుంచి మంచి గుర్రాలు రెండింటిని కొనుక్కుని వచ్చాడు కూడాను. ఆ గుర్రాలు గాలితో సమానమైన వేగంతో యెగిరి వెళ్లాయి. వారిద్దరూ ఆ గుర్రాలపై నెక్కి సప్త సముద్రాలనూ దాటి భూప్రదేశంలో దిగారు. అక్కడ హాతింకి మంచి



ఆకలీ-దప్పికా కలిగాయి. అప్పుడు గంధర్వ కుమారుడు తన దగ్గర వున్న ఒక పండు తిన మని హాతిం కిచ్చాడు. దగ్గరలో వున్న సెల యేటి నీరు తెచ్చి త్రాగమని యిచ్చాడు. దాంతో హాతిం తాలూకు బడలిక యావత్తూ పోయి అతనిలో క్రొత్త వుత్సాహం వురకలు వేసింది.

ఇద్దరూ కలిసి మళ్లీ ప్రయాణం మొదలెట్టారు. అలా పదిరోజులు గడిచి పదకొండవ రోజున బరఝోక్ రాజ్యం పొలిమేరలకు చేరుకున్నారు. అక్కడొక సత్రంలో బసచేసి, ఒక సేవకుడి ద్వారా తాము వచ్చిన పనేమిటో మహారాజుకి తెలియజేశారు. అది విని మహారాజు వారిద్దరికీ గొప్ప గౌరవ మర్యాదలన్నీ జరిపించాడు. ఇంత వరకూ ఆ మహారాజు యాత్రికుల వల్ల పరోపకారి అయిన హాతిం మహాత్మ్యాన్ని వింటున్నాడు. అలాంటి మహానుభావుడే స్వయంగా తన రాజ్యానికొచ్చినందు కతనెంతో ఆనందించుకున్నాడు!— వెంటనే ఆయన తన ప్రధాన మంత్రిని పంపించి హాతింనీ, ఆ గంధర్వకుమారుణ్ని రాజలాంఛనాలతో తీసుకు రమ్మని అజ్ఞాపించాడు. అంతే గాకుండా నగర మంతటా దండోరా వేయించి హాతిం వచ్చిన సంగతి ప్రజలందరికీ తెలియ జేశాడు. ప్రజలంతా తమ యిళ్లకూ-వీధులకూ తోరణాలు కట్టి ఎన్నో విధాల అలంకరించారు. బంగారు రథంలో హాతింనీ-గంధర్వకుమారుణ్నీ రాజభవనానికి తీసుకెళ్లారు. అంతఃపురం ముఖ ద్వారం ముందు బరఝోక్ రాజు, రాణి, రాజపుత్రి నిల్చుని ఎమెన్ రాజకుమారుడికి నిల్చుని సగౌరవంగా స్వాగతం చెప్పారు. ఈ





గందరగోళంలో గంధర్వకుమారుడి కళ్లు రెండూ రాజకుమారి పైనే వున్నాయి. ఆమె యెప్పుడు తన భార్య అవుతుందో అని ఉవ్విళ్లూరుతున్నాడు. హాతింనీ - గంధర్వకుమారుణ్ని మహారాజు తన మహల్లోకి తీసుకెళ్లి అనేక రుచికరమైన వంటలతో పంచ భక్ష్య పరమాన్నాలన్నీ వారికి పెట్టి సత్కరించాడు. తర్వాత ఉభయులూ కొంతసేపు కుశల ప్రశ్నలు వేసుకున్నారు.

ఆ మాటల సందర్భంలో హాతిం, హుస్న భాను, మునీర్‌షా. సంగతి వివరించి, తను యిప్పటి కయిదు సమస్యల్ని పరిష్కరించాననీ, ఆరవ ప్రశ్న కోసమే యిక్కడి కొచ్చాననీ చెప్పాడు.

"నా వల్ల యేం సాయం కావాలన్నా చేస్తాను. సెలవియ్యండి మహానుభావా" అన్నాడు మహారాజు నమ్రతగా.

"ఆ యారవ ప్రశ్న మరేమిటో కాదు. మీ దగ్గర గోళీకాయంత పెద్ద ముత్యం వున్నది గదా!-అంత పెద్ద ముత్యం మరొకటి నా కిప్పుడు మీ రివ్వాలి. అంతే; హుస్నభాను తన దగ్గర వున్న ముత్యాన్ని నా కిచ్చింది. ఇదుగో ఆ ముత్యం; ఇలాంటి పెద్ద ముత్యం మీ దగ్గర వున్నదని తెలుసుకుని ఇక్కడి కొచ్చాను" అన్నాడు హాతిం.

"అవును-నా దగ్గర యింత గొప్ప ముత్యం వున్నమాట నిజమే-కాని అది యెలా పుట్టిందో ఆ కథ వివరంగా చెప్పేవారికి నా కుమార్తె నిచ్చి పెళ్లి చేయడమే గాకుండా, ఈ ముత్యాన్ని కట్నంగా చదివించు కుంటానని ప్రకటించాను. ఈ మాటకు నేను బద్ధుణ్ని గదా మరి!-అందువల్ల యీ సంగతి మీకు తెలిసినట్టయితే దయచేసి చెప్పండి" అంటూ వేడుకున్నాడు మహారాజు.

అప్పుడు హాతిం రాజహంసలు చెప్పుకున్న ఆ ముత్యం వుత్పత్తి కథను వివరంగా విశద పరచాడు-కథంతా విని యెంతో సంతోషించాడు బరఝోక్ మహారాజు. తన బొక్కసంలో నుంచి పెద్ద ముత్యం తీసి హాతింకి సమర్పించుకున్నాడు. "నా కూతురు మంచి చెడ్డలన్నీ యిటుపైని మీరే చూసుకోవాలి"

అంటూ ఆ రాజు తన కూతుర్ని కూడా అత నికే అప్ప జెప్పాడు.

అందుకు హాతిం, - "రాజా, మీ కుమా ర్తెను యీ గంధర్వ కుమారుడికిచ్చి పెళ్లి చేయండి" అన్నాడు. బరఖ్రోక్ మహారాజు అలాగేనని రాజపుత్రికీ-గంధర్వ కుమారుడికీ అతివైభవంగా అయిదు రోజులపాటు వివా హం చేశాడు.

తర్వాత హాతిం మహారాజు వద్ద సెలవు పుచ్చుకుని షహబాదుకి బయలుదేరాడు. వీర సింహుడి రాజ్యం వరకు అతణ్ని దిగబెట్టి రమ్మని తన సేనాపతికి అజ్ఞాపించాడు బర ఖ్రోక్ మహారాజు. సేనాపతి పెద్ద సైన్యాన్ని తన వెంట బెట్టుకుని హాతింతో వెళ్లాడు. మధ్య దార్లో యెదురయే రాక్షసుల్ని శక్తి యుక్తులతో హతమార్చి వీరసింహుడి రాజ్యా నికి హాతిం సురక్షితంగా చేర్పించి తిరిగి వెళ్లి పోయాడు.

హాతిం విజయవంతుడై తిరిగి రావడం చూసి ఎంతో సంతోషించాడు వీరసింహుడు. హాతిం రెండు రోజులపాటు తన దగ్గరే వుంచు కుని సత్కరించాడు. తర్వాత విమానంలో అతణ్ని షహబాదుకి దిగబెట్టి రమ్మని తన భటుల నాజ్ఞాపించాడు. హాతిం ఆ విమానంలో వాయువేగంతో షహబాదు చేరుకున్నాడు. వీరసింహుని భటుల్ని తిరిగి సాగనంపి తన మిత్రుడు మునీర్‌షాని కలుసుకుని అతనితో హుస్నబాను అంతఃపురాని కెళ్లాడు. ఆమెకు



ఆ రెండవ ముత్యాన్ని సమర్పించుకుని తన ప్రయాణంలో జరిగిన వింతలన్నిటినీ వివ రించి చెప్పాడు అది విని "ఆహా-ఎంత గొప్ప మహానుభావుడివయ్యా హాతిం" అంటూ పొగడి మెచ్చుకుంది.

"అయితే మరి ఏడవ ప్రశ్న యేమిటీ?" అని అడిగాడు హాతిం-

"హమామబాద్ 'గిర్ద' అనే పర్వతం వృత్తాంతం తెలుసుకుని రావాలి. ఇదే నాకడ సారి ప్రశ్న" అన్నది హుస్నభాను.

ఇది విన్న వెంటనే యిక ముందు వెనక లాలోచించకుండా హాతిం హుస్నభాను మునీ ర్ల దగ్గర సెలవు పుచ్చుకుని కార్యదీక్షతో బయలుదేరాడు. కొన్నాళ్ల కతను ఒక పట్ట

ణానికి చేరుకున్నాడు. ఆ పట్టణం చాకిరేవు దగ్గర ఏదో నూతిచుట్టూ చాలామంది జనం గుంపులు గుంపులుగా గుమికూడి విడ్డూరంగా నూతి లోపలికి చూస్తూ వుండడం కనిపించింది. అదేమిటో కనుక్కుందాం గదా అని అక్కడి కెళ్లాడు హాతిం. అంతలో యిద్దరు ముసలి దంపతులు అక్కడి కొచ్చి నూతిలోకి ఒకసారి చూసి నిరాశపడి భోరుమని యేడవ ఆరంభించారు. ఎందుకయ్యా ఏడుస్తున్నారని హాతిం అడిగే సరికి గుంపులో ఒకాయన ముందుకొచ్చి యిలా చెప్పాడు-"ఈ ముసలి దంపతులున్నారే-వీరి ఏకైక పుత్రుడు విలోకననేవాడు. మూడు రోజుల క్రితం అతని బుర్ర చెడిపోయింది. పిచ్చెక్కి పోయాడు. ఎందరెందరో వైద్యులకి చూపించి మందిప్పించారు. కాని గుణ మివ్వలేదు. ఆ బాధ భరించలేక ఆ కొడుకు ఈ నూతిలో పడి చచ్చిపోయాడు. ఇప్పటి కప్పుడే మూడు రోజులైపోయినా అతను గానీ-అతని శవం గానీ నీటి పైని తేల లేదు. అందుకే మేమంతా ఇలా విచారిస్తూ యిక్కడ కాచుకుని కూర్చున్నాం-ఈ మాటలు విని హాతిం నిర్ఘాంత పోయాడు. దీంట్లో యేదో రహస్యం వుండి వుంటుందని ఆ వృద్ధ దంపతుల దగ్గర కెళ్ళి.- "మీరు దిగులు పడకండి. మీ కుమారు డెక్కడున్నా నేను పట్టుకుని తీసుకొస్తాను" అంటూ అభయ మిచ్చి తానూ గభాల్న అదే నూతి లోకి గెంతి వేశాడు. అడుక్కిపోయి హాతిం కళ్లు తెరిచి చూశాడు. అక్కడతని కొక రమణీయమైన తోట కనిపించింది.

[ఇంకా వుంది]

*
* *



['హమామబాద్' అనే పర్వతం వృత్తాంత మేమిటో తెలుసుకుని రావాలి. ఇదీ హుస్నభాను అడిగిన కడసారి ప్రశ్న. హాతిం అందుకై వెళ్తూ వుండగా ఒక పట్టణం పొలిమేరల్లో ఒక నూతిచుట్టూ చాలా మంది జనం గుమిగూడి వుండడం కని పెంచారు. ఆ వూళ్లో వుండే ముసలి దంపతుల కొడుకొకడు ఆ నూతిలో పడి మూడు రోజులైనా పైకి తేల లేదట. అప్పుడు హాతిం ఆ నూతిలోకి గెంతి వేశాడు. దాంట్లో నీటి అడుగున అతని కొక రమణీయమై వుద్యానవనం కనిపించింది.]

ఆ తోటలో కెళ్లి అక్కడొక చిన్న కుటీరం వుంటే, దాంట్లో అడుగు పెట్టాడు. దాని తలుపులు తీసే వున్నాయి. లోపలి కెళ్లి చూడగా, చుట్టూ నాలుగు గోడలూ బంగారు మలామా చేయబడినట్టున్నాయి. క్రిందని రత్న కంబళ్ళు పరచి వున్నాయి. కిటికీ లన్నిటికీ పరదాలు మూసి వున్నాయి. మధ్యను రత్న ఖచితమైన సింహాసనం పైని అపర రతీదేవి యేమో అన్నట్టుగా వున్న అందాల భామ ఒకామె కూర్చుని వున్నది. ఆమె ప్రక్కనే యెవరో యువకుడు గూడా వున్నాడు వారిద్దరి విలాసం కోసం. పాట కచేరీ కూడా జరుగుతున్నది. గభాల్న హాతిం అక్కడికి రావడం చూసి ఆ యువతి ప్రక్కకి తప్పుకుని తన నేస్తంతో,-"ఏమండీ, ఈయ నెవరో మానవుడి లాగ వున్నాడు. మీతో యేదో పని వుండి వచ్చినట్టున్నాడు. సంగతేమిటో కనుక్కోనా-' అన్నది.

అలాగే నన్నాడా యువకుడు. అప్పు డామె ఒక దాసీ దాన్ని పంపి హాతింని తన దగ్గరకు పిలిపించుకున్నది. హాతింని గౌరవ పూర్వకంగా ఒక పెద్ద ఆసనం పైని కూర్చోబెట్టి,- 'ఎక్కణ్నుంచి రావడం?- ఎందుకొచ్చినట్టు?-' అంటూ ముక్తసరిగా మూడు మాటల్లో అడిగింది.

అందుకు హాతిం అన్నాడు గదా, "అమ్మాయీ, నేను ఎమెన్ దేశపు యువరాజును హమామబాద్ పర్వతం సంగతి సమాచార మేమిటో కనుక్కుందామని బయలుదేరాను. మధ్య దార్లో ఒక వూరి చాకిరేవు దగ్గర యేదో నూతి చుట్టూరా గుంపులు గుంపులుగా కూడి నిల్చున్నారు. ఏమిటని అడగ్గా ఆ వూళ్లో పేరు మోసిన వైద్యుడికొడుకు మతి చెడి ఆ బావిలో దూకి పడిపోయినట్టు - మూన్నాళ్లయినా ఆ యువకుడి శవం యెంత వెతికినా కనిపించనట్టూ తెలిసింది. అతగాడి ముసలి తల్లిదండ్రుల దుఃఖం చూసి నా గుండె కరిగింది. వారి అబ్బాయి నెలాగైనా వెతికి పట్టుకొచ్చి అప్పగిస్తానని వారికి మాట ఇచ్చి అదే బావిలో దూకి ఇలా మీ దగ్గర కొచ్చాను. ఇదీ నా

కథ!"; తన ముసలి తల్లిదండ్రులు తన గురించి ఎంతో దిగులు పడి బెంగపెట్టుకున్నా రన్న సంగతి తెలుసుకున్న వెంటనే, అంత వరకూ అక్కడే కూలబడిన ఆ యువకుడు లేచి,- "అవునండీ-మీరు చెప్పినవారి అబ్బాయినే నేను. మీరు యే బావిలోనైతే దూకి ఇంత దూరం వచ్చారో, ఆ బావి గట్టుమీదనే కొన్నాళ్ల క్రిందటి దాకా కూర్చునేవాణ్ని - అప్పుడీ అందాల అమ్మాయి ఆ బావి లోపల నుంచి పైకి వచ్చింది. ఈమె అపురూప సౌందర్యాన్ని చూసి మోహితుణ్నయాను - దాంతో ప్రతీ రోజూ ఆ నూతి గట్టుపైకొచ్చి కూర్చోవడం మొదలెట్టాను. ఈమె కూడా ప్రతి రోజూ నూతిలో నుంచి పైకొచ్చి నన్ను క్రీగంట చూస్తూ నా మనసు లాక్కున్నది. ఈమెకి నేనంటే ఎంతో అనురాగం కలిగింది. సరిగ్గా ఇప్పటికి మూడురోజుల క్రిందటే ఈమెతో నేనీ బావిలోకి దిగి ఇక్కడికి చేరుకుని, ఈమెను గాంధర్వవివాహం చేసుకున్నాను. ఇక్కడ నాకు స్వర్గలోకం కన్న యెక్కువ సుఖంగా వుంది" అని చెప్పాడు.

అందుకు హేతిం,-"అలాగా నాయనా, ఈ అమ్మాయి ప్రక్కనుంటే నీకు స్వర్గం కన్న యెక్కువ సుఖంగా వుండవచ్చు. కాని అక్కడచూస్తే నీ తల్లిదండ్రులు పుత్ర వియోగంతో యెంత బాధపడ్తున్నారో ఆలోచించావా? - ముసలితనంలో తల్లిదండ్రులకి తనయుడే గదా ఆధారం!-ఈ సంగతి నేను



ప్రత్యేకంగా చెప్ప నక్కర్లేదు. నీ కర్తవ్యాన్ని మరచిపోయి స్త్రీ లోలుడవై యిలా సంచరించడం బాగుందా నువ్వే చెప్పు" అన్నాడు. అంతే గాకుండా అసలు సంగతి ఆ యమ్మాయికి కూడా చెప్పి, ఆ యువకుణ్ని యెలాగైనా కొన్నాళ్లపాటు వదిలి పెట్టమని విన్నవించుకున్నాడు. అందుకా అమ్మాయి,- "మానవమాత్రుడైన ఇతగాడు ఒకసారి నా దగ్గర నుంచి దూరమయ్యాడంటే ఆఖరి వరకూ నన్ను మరిచి పోతాడేమోనని భయపడ్తున్నాను" అన్నది.

అది విని ఆ యువకుడు తన ప్రేమ యెన్నటికీ మారిపోదని అగ్నితో ఆమె యెదురుగా ప్రమాణం చేశాడు. మరి కొన్నాళ్లలోనే తిరిగి



వస్తానని అమెకి మాట యిచ్చాడు. వెళ్లి వస్తానని బయలుదేరాడు.

అప్పుడా యువతి "అయ్యో, నా నేస్తం నన్ను వదిలి వెళ్లిపోతున్నాడే అని ముందు విచారంతో కన్నీరు కార్చినా, తర్వాత మనసు గట్టి చేసుకుని ఆ యువకుణ్నీ, హాతింనీ బావి పైకి దిగబెట్టి మరీ వచ్చింది. హాతిం ఆ యువకుణ్ని వెంటబెట్టుకుని బయటికొచ్చాడు. బావి చుట్టూ కన్నీరు కారుస్తున్న జనం అందరికీ జరిగిన భోగట్టా యావత్తూ సవివరంగా చెప్పాడు. తర్వాత కంటికీ — మంటికీ యేక ధారగా యేడుస్తున్న ముసలి తల్లి తండ్రులకి వాని కొడుకుని అప్పగించాడు. కొడుకుని చూసీ చూడగానే వారికి ప్రాణం లేచి వచ్చి నట్టయింది. ప్రేమగా - అప్యాయంగా అతణ్ని కౌగలించుకున్నారు ముద్దు పెట్టుకున్నారు. ఆ దృశ్యాన్ని చూసి అక్కడున్న వారంతా అనంద భాష్పాలు రాల్చారు. హాతిం కళ్ళు కూడా చెమ్మగిల్లాయి. కొంత సేపటికి అతను తన పనిమీద వెళ్ళిపోతున్నాననీ, అంచుకు సెలవియ్యమనీ అందర్నీ అడిగాడు. కాని ఆ వూరి ప్రజలు అతను చేసిన యీ వుపకారాని కెంతో మెచ్చుకుని అతణ్ని అక్కడే వుండి పోవాలని కోరారు. అంతే కాదు. అతణ్ని ఆ వూరి మునసబు గారి దగ్గరకు తీసుకెళ్లి చూపించి జరిగిన సంగతి యావత్తూ సవివరంగా మనవి జేశారు. మునసబుగారు హాతింని యెన్నోవిధాల సత్కరించి విలువైన వలువలూ-అమూల్యమైన రత్నాలూ - వజ్రాలూ బహూకరించారు. హాతిం రెండు రోజు లక్కడ వుండి ఆయన దగ్గర సెలవు తీసుకుని మళ్లీ తన పని మీద బయలు దేరాడు. అలా వెళ్తూ వుండగా దార్లో ఒక ఫకీ రతనికి కనిపించాడు. "ఎవరు నాయనా నువ్వు? - ఎక్కడి కెళుతున్నావు?" అంటూ పలుకరించాడా ఫకీరు.

అందుకు హాతిం, "అయ్యా, నేను ఎమెన్ దేశపు యువరాజును హమామబాద్ పర్వతం తాలూకు చరిత్ర ఏమిటో కనుక్కుని రావాలని బయలుదేరాను" అని చెప్పాడు.

"అలాగైతే దయచేసి యీ దగ్గర లోనే వున్న నా మఠంలో ఒక్క పూటయినా వుండాలి" అన్నాడా ఫకీరు.

అందుకు సరే నని తల వూపాడు హాతిం. ఇద్దరూ ఆ ఫకీరు మఠానికెళ్లారు. ఫకీరు కొంతసేపు యేదో ధ్యానం చేశాడు. అంతలో రెండు విస్తళ్లలో రకరకాల పిండి వంటలతో భోజనాలు తయారయాయి ఇద్దరూ భోంచే శారు. తర్వాత మాటల్లోకి దిగారు. .

"హాతిం, హమామబాద్ పర్వతాని కెళ్లా లనే ఆశ యిప్పటికేనా వదులుకో - ఎందు కంటే ఇంతవరకూ దాని దగ్గర కెళ్లాలని యెంద రెందరో ప్రయత్నించారు. వెళ్లే టప్పుడు వారంతా యిదే మఠంలో ఒక పూట వుండి నాతో పరామర్శ చేసి తమ దృఢ నిశ్చ యాన్ని చెప్పేవారు. కానైతే అలా వెళ్లిన వారిలో ఒక్కరూ తిరిగి రావడం కనిపించదు. అందుకని నువ్వన వరంగా నీ ప్రాణాల్ని ఇరు కులో పెట్టుకోకు. బాగా ఆలోచించుకో" అని చెప్పాడా ఫకీరు-

అందుకు హాతిం కించిత్తూ చలించ లేదు,- "అయ్యా, ఇంతవరకూ ఎన్నెన్నో కష్టాల నుంచి కాపాడిన ఆ పరమేశ్వరుడే ఇటుపైని కూడా నాకీ గండాన్ని గట్టెక్కించ గలడు నే నాయన చేతుల్లోనట్టి కీలుబొమ్మని మాత్రమే! మనల్నందర్నీ ఆడించే సూత్రధారుడా భగ వంతుడే!-ఆయనపై నాకు పరిపూర్ణమైన విశ్వాసముంటే ఆయన తన భక్తుల కెలాంటి కష్టం కలిగినా వెంటనే వారిని ఆదుకుని కాపాడకుండా వుండడు. అలాంటప్పుడు హమామబాద్ పర్వతాని కెళ్ళి రావడం ఓ గొప్ప ఘన కార్యమా?" అన్నాడు

అప్పుడా డాఫకీరు అన్నాడు గదా- "నువ్వు చెప్పిన మాటలు ముమ్మాటికీ నిజమే కాని ఆ హమామబాద్ పర్వతం పైని కని పించే ఆ మాయ గారడీ ఎవరికీ అంతు చిక్కదు. దానిరహస్య మేమిటో ఇంతవరకూ







నన్ను ఆశీర్వదించండి" అన్నాడు. హాతిం తాలూకు యీ దృఢ నిశ్చయానికి ఫకీరు ఎంతో ఆశ్చర్య పోయాడు. ఇక యెన్ని చెప్పినా లాభం లేదని ఆయన హాతింని వెంట బెట్టుకుని బయలుదేరాడు. కొంతదూరం వెళ్లే సరి కాదారి రెండుదారులుగా చీలి పోయింది. అప్పుడు ఫకీరు,-"ఇదుగో చూడు, నువ్వి కుడి ప్రక్కదారి వెంట వెళ్ళు. కొంతదూరం వెళ్ళేసరికి దార్లో నీకు ఎత్తయిన పర్వతం ఒకటి కనిపిస్తుంది. దాన్ని కూడా దాటుకుని వెళ్లావంటే మళ్ళీ రెండు దారులు వస్తాయి అప్పుడు ఎడం వైపు దారిపట్టుకుని వెళ్లాలి. కుడిప్రక్క దారి కాస్త దగ్గర దోవయినా అటు వెళ్తే చాలా గండాలున్నాయి. అందుకని దూరమైనా ఫర్వాలేదు ఎడంవైపు దోవనే వెళ్ళు నువ్వు తలపెట్టిన కార్యం సిద్ధిస్తుంది" అని చెప్పాడు. హాతిం ఆ ఫకీరుకి కృతజ్ఞతా పూర్వకంగా నమస్కరించి తన దారిని తను బయలు దేరాడు.

యెవ్వరికీ తెలియదు. నీకూ తెలియదు. అంత భయంకరమైన ఇంద్రజాలం అది; అందుకని నా మాటలు లెక్క పెట్టకుండా మొండి పట్టుతో వెళ్లావంటే ఇదివరకు వెళ్లిన వారి గతే నీకూ పడ్తుంది సుమా!"

హాతిం చేతులు జోడించి ఆ ఫకీరుకి నమస్కరించి, "స్వామి మీరు చెప్పింది సరే! మీ వుపకారాన్ని యెన్నటికీ మరువ లేను. మీ దయవల్ల నేనింతవరకూ తలపెట్టిన కార్యమేదీ వృథా కాలేదు. ఈ కార్యం కూడా దేవుడు దిగ్విజయంగా జరిపిస్తాడని చాలా ఆశ పెట్టుకున్నాను. ఆ పర్వతాని కెళ్లే దారెటో మీకు తెలిస్తే అది నాకు చెప్పండి. శుభంగా వెళ్లి కార్యం సాధించుకు రమ్మని

కొంతదూరం అలా వెళ్ళేసరికి దార్లో అతని కొక పట్టణం తారస పడింది. అదంతా మామిడాకుల తోరణాలతో అలంకరించ బడి వుంది. భేరీలు, నగారాలూ, ఇంకా రకరకాల వాయిద్యాల మోతలతో పట్టణమంతా మారు మ్రోగి పోతూ వున్నది. అదంతా చూస్తూ వుంటే ఆ వూళ్లో యేదో వైభవం జరుగుతుందేమో నన్నట్టుగా వున్నది. అదేమిటో చూడాలని హాతింకి అభిలాష కలిగింది అందుకని

ఆ వూళ్లో అడుగుపెట్టాడు. వీధిలో ప్రతి ఇంటి ముందూ పెద్ద పెద్ద పందిళ్లూ-మండపాలూ కట్టారు. రత్నాల మోస్తరుగ్గా జిగజిగా మెరిసిపోయే దీపాలు వెలుగుతున్నాయి. వేల కొద్దీ జనం అందమయిన దుస్తుల్ని ధరించి ముస్తాబై అటూ-ఇటూ తిరుగుతున్నారు. యువతులందరూ రక రకాల నృత్యాలు చేస్తున్నారు. ఒకచోట పెద్ద పెద్ద పొయ్యిలపై ఘుమఘుమలాడే పిండి వంటలూ - భోజనాలూ తయారవుతున్నాయి. హాతిం అదంతా చూసి ఒకాయన్ని,-"ఏమిటి బాబూ యీ హడావుడి అంతాను?" అని అడిగాడు.

అందుకా యాసామీ అన్నాడు గదా,- "అయ్యా-ఈ పట్టణంలో యేటేటా సరిగ్గా యీనాడొక భయంకరమయిన మహాసర్పం ఒకటి మానవ రూపం ధరించివస్తుంది. అప్పుడీ పట్టణంలో నున్న చిన్న పిల్లల్ని అంటే పదహారేళ్ళుదాటని పసి పిల్లల్ని దానిముందు నిలపాలి. అలా నిలబెట్టిన పిల్లల్లో యెవరో ఒక అబ్బాయి నది కరిచి చంపి వేస్తుంది ఆ సర్పం వచ్చేరోజు ఈ వేళే!-దాని సంతృప్తి కోసమే యీ ఆటాటోప మంతా జరిపిస్తున్నాం. మేమంతా యేదో సంబరం చేసుకుంటున్నట్టు ఉత్సాహంగా కనిపిస్తున్నా, మా మనస్సు లన్నీ దిగులుతో కుంగి పోతున్నాయంటే నమ్మండి. ఈ సారి ఆ పాపిష్టి సర్పం యెవరి అబ్బాయిని కరిచి వేస్తుందో నని-ఈ పట్నంలో ప్రతి ఒక్కరూ బెంగ పెట్టుకుని



వున్నారు"-ఇదివిని హాతిం ఆశ్చర్యపడి,- "అయ్యా, అయితే ఒక్క మనవి. మీరా సర్పాన్ని నాకు చూపించండి. దాన్ని సంహరించి మీ కష్టాల్ని నివారిస్తాను అవసరంపడ్తే మీరంతా నాకు సహాయంగా వుండనే వుంటారు అందువల్ల యిటుపైని ఆ పాముకి భయపడవలసిన పనిలేదు" అంటూ ధైర్యం చెప్పాడు.

హాతిం చెప్పిన మాటలకి అత గాడెంతో ఆనందించాడు. గబగబా వెళ్లి యీ సంగతి తమ రాజు గారి చెవిలో, వూదాడు. దాంతో రాజుగారే స్వయంగా వచ్చి హాతింని సగౌరవంగా తన అంతఃపురానికి తీసుకెళ్లాడు. తర్వాత అతణ్ని తన సింహాసనం దగ్గర

కూర్చోబెట్టుకుని, - "అయ్యా, మా యీ పట్ట ణానికి దాపురించిన యీ కష్టాన్ని మీరు గట్టెక్కించారంటే మేమూ - మా ప్రజలూ మిమ్మల్ని సాక్షాత్తూ ఆ భగవంతుడేనని కొలిచి పూజించుకుంటాం" అన్నాడు.

అందుకు హాతిం,-"అది సరే కాని భగ వంతుడి కృప అనేది వుంటే యెంత కష్ట మయినా యిట్టే దాటుకుని రావచ్చు. ఆ సర్పం మనిషిరూపంలో వచ్చి పిల్లల్ని యెంచుకునే, సమయం కనిపెడ్తున్నప్పుడు మీరు దాంతో యేమనాలో తెలుసా? - "మా చక్రవర్తి గారి కొడుకు కిక్కడికి వచ్చారు. అయన అనుమతి లేకుండా యే పిల్లవాణ్నీ నీకప్ప జెప్పడానికి వీల్లేదు" అని మాత్రం ధైర్యంగా చెప్పాలి" అన్నాడు.

"సరే, అలాగే నని రాజుగారు అంగీకరిం చారు. అంతలో ఆ సర్పం వూళ్లో పడినట్టు ఒక సేవకుడు వచ్చి భోగట్టా అందజేశాడు. వెంటనే రాజుగారు ప్రజలందర్నీ వెంటబెట్టు కుని ఆ సర్పాని కెదురు వెళ్లాడు. ఆ పాము అల్లంత దూరాన వుండగానే చూసి.-"ఎవడో రాక్షసుడీ సర్ప రూపం ధరించి నట్టుంది- కానివ్వండి. సమయం వచ్చినప్పు డదే బయట పడ్తుంది" అనుకున్నాడు మనసులో హాతిం.

అంతలో ఆ మహా సర్పం మనిషి రూపం లోకి మారిపోయింది. వెంటనే రాజుగా రా మానవరూపంలో నున్న సర్పానికి మర్యాదగా స్వాగతం చెప్పి సింహాసనంపైని కూర్చోబెట్టి భయభక్తులతో-వినయ విధేయతలతో చేతులు జోడించి నిల్చున్నాడు. అందరూ భోజనాలు చేశారు. తర్వాత వూళ్లో వున్న పిల్లలందర్నీ తీసుకొచ్చి ఆ రాక్షసుడి యెదుట నిలబెట్టారు.

[వచ్చే సంచికలో ముగింపు]



'హమామ బాద్' అనే పర్వతం తాలూకు వృత్తాంతమేమిటో తెలుసుకుని రావాలి. ఇది హుస్నబాను అడిగిన కడసారి ప్రశ్న. హాతిం అందుకై బయలుదేరాడు. దారిలో అతని కొక ఫకీరు కనిపించాడు. ఆయన 'హమామబాద్ పర్వతానికెళ్ళే దారెటో చెప్పాడు. హాతిం వెళ్లివెళ్లి ఒక పట్టణం చేరుకున్నాడు అక్కడ ఆ వేళ భయంకరమైన మహా సర్పం ఒకటి మానవరూపం ధరించి వస్తుంది. దానిముందు వూళ్ళో పిల్లలందర్నీ నిలబడ్తే అది ఎవరో ఒక అబ్బాయిని కరిచి చంపివేస్తుంది ]

అప్పుడు మనిషి రూపంలో నున్న ఆ పాము పిల్ల లందరి మధ్యనూ వున్న రాజ కుమారుణ్నే ఆఖరికి యెంచుకున్నది. అది చూసి భయంతో గజగజలాడి పోయాడు మహారాజు. హాతిం చెప్పిన మాటల్ని కచ్చితంగా ఆ పాముతో చెప్పి వేశాడు.

దాంతో ఆ పాము కెక్కడా లేని కోపం వచ్చింది. "అయితే ఆ చక్రవర్తి కొడుకునే నా ముందు హాజరు పెట్టు" అంటూ ఆజ్ఞాపించింది. వెంటనే హాతింని పిలుచు కొచ్చి ఆ నర రూప సర్పం యెదురుగా నిల్చోబెట్టారు. హాతింని చూడగానే పాము తాలూకు గర్వమంతా పటాపంచలై పోయింది.

వెంటనే హాతిం యెలుగుబంటి రాకుమారి యిచ్చిన ముత్యాన్ని నీట్లో కొంతసేపు వుంచి ఆ నీటిని త్రాగమని మానవ రూపంలో నున్న పాము కిచ్చాడు.

అదేం విడ్డూరమో గాని, ఆ నీటిని త్రాగిన కొన్ని గడియలకే ఆ పాము తాలూకు మనిషి రూపమంతా మాయమయి పోయింది. రాక్షస రూపం వచ్చింది. బలహీనుడై క్రిందిని నక్కి కూర్చున్నాడు. హాతిం అతగాణ్ని అక్కడున్న వాళ్ళందరికీ చూపించి,—"ఇదుగో చూడండి—ఈయన గారి అసలు బండారం ఇన్నాళ్లూ పాము రూపం వేసుకుని మిమ్మల్ని భయపెట్టి హింసిస్తున్నాడు. ఈ వేళ యెంత బలహీనుడిగా పడి వున్నాడో చూశారా!-ఇక వీడు చచ్చినట్టే!-బలమంతా పూర్తిగా పోయింది. వెంటనే పెద్ద చితి పేర్చి దాంట్లో వీణ్ని పడవేసి చుట్టూ నిప్పంటించండి" అని చెప్పాడు.

రాజుగారలాగే చేశారు. మరికొంత సేపటికల్లా మహా కాయుడైన ఆ రాక్షసుడు మాడి మసియై పోయాడు హాతిం తాలూకు అపూర్వమయిన నేర్పుకు ఎంతో మెచ్చుకుని ఆ పట్టణం రాజుగారూ-ప్రజలూ ఎన్నెన్నో కానుకల్ని సమర్పించుకున్నారు. రెండు మూడు రోజులవరకూ హాతింని తమ దగ్గరే వుంచుకుని మంచి మంచి విందు భోజనాలు పెట్టి సత్కరించారు. ఇలా వృథాగా కాలం గడపడం హాతింకి సుతరామూ యిష్టం లేదు. అందుకని రాజు గారి దగ్గర సెలవు పుచ్చుకుని మళ్లీ తన దారి తను పట్టాడు.

రచన: "బాలమిత్ర"

కొన్నాళ్ళు వెళ్లగా, వెళ్లగా అతను విలాస పురమనే పట్టణానికి చేరుకున్నాడు. అక్క డొక సత్రంలో బస చేసి భోంచేసి విశ్రాంతి తీసుకున్నాడు-తర్వాత గొప్ప గొప్ప విలువైన రత్నాలను-ముత్యాలను ఆ పూరి రాజుగారి దగ్గర కెళ్లి వాటిని ఆయనకు సమర్పించుకుని ఆయన రాజ్యంలో నున్న హమామబాద్ పర్వ తంపై కెక్కడాని కెలాగో అనుమతి కాస్తా సంపాదించాడు.

హాతిం నాలుగైదు రోజులు నడిచిన తరు వాత ఆఖరి కెలాగయితేనేం హమామబాద్ పర్వతం చేరుకున్నాడు. అక్కడ కాపలా కాస్తున్న భటులకి రాజుగారిచ్చిన ఫర్మానా చూపించాడు. దాన్ని ఆ కాపలావాడు చదివి ఆ పర్వతానికెళ్లేదారి ఎటో చెప్పి, ముఖద్వారం దాకా అతణ్ని దిగబెట్టి మరీ వచ్చాడు. ఆ ముఖద్వారం పైని యిలా వ్రాసి వున్నది —

"ఈ పర్వతం పైనున్న 'హమామఖాన్' గృహంలో శూరసేనుడనే రాజుగారేర్పాటు చేసిన ఇంద్రజాలం బహుకాలం నుంచీ వుం టున్నది. ఆ ఇంద్రజాలపు గృహంలో ప్రవే శించేవారికి ఆకలి, దాహం మొదలైన యే బాధలూ వుండవు. ఆ గృహంలో ప్రవేశించే మనిషి మరే జన్మలోనూ తిరిగి రాలేడు" —

అది చదువుకున్నాడు హాతిం. భగవంతుడే దిక్కు అని ఆయన్ని ఒకసారి మనసార ధ్యానించుకున్నాడు. కాస్త ముందు కెళ్ళి తిరిగి చూసే సరి కక్కడ కాపలా వారెవరూ కనిపించ లేదు. మరి కొంచెం దూరం నడిచి



వెళ్ళేసరి కతని కొక ఆసామీ కనిపించి యేదో అద్దం ఒకటి చూపించాడు. దాంట్లో హమామ ఖాన్ గృహం యావత్తూ కళ్లకు కట్టినట్టు కని పించింది.

హాతిం బ్రతిమాలగా, బ్రతిమాలగా ఆఖరి కా యాసామీ హమామఖాన్‌కి ఎటు వెళ్ల డమో దారి చూపించేందు కొప్పుకున్నాడు. హాతింని తన వెంట బెట్టుకుని ఒక చెరువు దగ్గరకు వచ్చి,-"ఇదుగో, నువ్వీ చెరువు గట్టున కూర్చో. నీ పైని ఒక కడవడు నీళ్ళు పోస్తాను. తర్వాత ముందు కెళ్ళుదువు గాని" అన్నాడు.

అలాగే నని తన బట్టలవీతీసి గట్టున పెట్టి ఆ చెరువు దగ్గర కూర్చున్నాడు. అతనితో వచ్చిన ఆసామీ మూడు కడవల నీటిని హాతిం



తల పైని పోశాడు. వెంటనే యేదో ప్రళయం వచ్చినంత గొప్ప భయంకరమయిన చప్పుడయింది. దశ దిశలూ ఆ చప్పుడుతో మారుమోగిపోయాయి. కొంతసేపటి కల్లా కళ్ళు తెరచి చూసేసరికి హమామఖాన్ గృహం తాలూకు గోపురం గడి గడియకూ పెరిగిపోవడం మొదలెట్టింది. ఆ చెరువు నీరు క్రమేపీ పొంగి ఒక్క గడియలో ఆ ప్రదేశమంతా జలమయమయి పోయింది. ఈ విడ్డూరాన్ని చూసి హాతిం ఎంతో ఉగ్భ్రమజెంది దిగులు పడ్డాడు. ఫకీరు మాట వినకుండా అలాంటి దారిని వచ్చినందుకు పశ్చాత్తాప పడ్డాడు. అయినా దేవుడి పైని భారం మోపి ఆ కొండ శిఖరాని కెలాగో నడిచి చేరుకున్నాడు. ఆఖరికా శిఖరం పైకి కూడా నీరు పొంగింది. కష్టపడి ఆ శిఖరాన్ని గట్టిగా పట్టుకున్నాడు. దాంతో మరింత భయంకరమయిన గర్జన మళ్ళీ వినిపించింది. కళ్ళు చీకట్లు కమ్మాయి. మరి కొన్ని క్షణాలకు తను యేదో పెద్ద కీకారణ్యంలో వున్నట్టు కనిపించింది.

ఆ యరణ్యంలో తన ఎదురుగానే తెరలు మూసిన గుమ్మాలు గల ఒక పెద్ద భవంతి అగుపించింది. వెంటనే హాతిం యిక ముందు వెనుక లాలోచించకుండా ఆ భవనంలో ప్రవేశించాడు. అన్ని మూలలకూ వెళ్లి యేముందో చూసి లోపలి కెళ్లాలనుకున్నాడు. కాని యెంత చూసినా అసలు గుమ్మం ఎక్కడుందో అతనికి కనిపించ లేదు. వెతికి వెతికి వేసారి పోయాడు. ఆకలికి కడుపు అల్లాడిపోసాగింది. ఆ భవనంలో తిరుగుతూ వుంటే ఒకచోట యేవో తినుబండారాలు కనిపించాయి. హాతిం వాటిని తీసుకుని తినడం మొదలెట్టాడు. అదేం విడ్డూరమో మరి, ఎన్ని తిన్నా అతనికి ఆకలి తీరలేదు. మళ్ళీ లేచి గుమ్మం ఎక్కడుందో వెతికాడు. ఆ భవనంలో ఒకచోట చలువ రాతితో తయారైన అందమయిన బొమ్మలతనికి కనిపించాయి. వాటిని చూడగానే హాతిం మనసులో ఎన్నెన్నో ఆలోచనలు బయలు దేరాయి.

కొంత సేపటికి మనిషి అరుపులు వినిపించాయి. వెనక్కి తిరిగి చూసేసరికి పంజరంలో నున్న చిలుక ఒకటి మనిషిలాగ అరుస్తూ మాట్లాడ్తూ వున్నది. అది హాతింని ఉద్దేశించి యేమన్నదో తెలుసా? — "ఓయి

నరుడా, ఇది శూరసేనుడనే మహారాజు నిర్మించిన ఇంద్రజాలపు గృహం. ఇందులో ఒకసారి యెవరైనా అడుగుపెట్టారంటే మళ్లీ తిరిగి వెళ్లడం కష్టం. శూరసేనుడు వేటాడేందుకని అడవి కెళ్తే ఆయన కొక మంచి రత్నం దొరికింది. అలాంటిదే మరొక రత్నం యెలాగైనా సంపాదించాలని ఆయన ఎన్నెన్నో సాహసాల్ని చేసి చూశాడు కాని సాధ్యపడలేదు అందువల్ల తన దగ్గర వున్నటువంటి ఆ యమూల్యమయిన రత్నం పైవారి చేతికి చిక్కకూడదనే తలంపుతో అనేక మంది మాంత్రికుల్ని ఆహ్వానించి వారి సహయంతో ఈ గారడీ చిలుకనీ పంజరంలో పెట్టాడు. ఈ భవనం నుంచి తిరిగి ప్రాణాలతో బయట పడాలని వుంటే అందు కొకే ఒక మార్గ ముంది. అదుగో, ఎదురుగుండా వున్న గోడకి ఒక ధనుస్సు తగిలించి వుంది. దానికి మూడు బాణా లున్నాయి. ఆ మూడు బాణాలతోను యీ చిలుకను కొట్టి వేయాలి' అలా మూడు బాణాలతోనూ చిలుక ప్రాణం తీయలేక పోయినట్టయితే ఆయన గతి కూడా యీ చలువరాతి బొమ్మల మాదిరే అవుతుంది"

చిలుక చెప్పిన యీ మాటలు వినగానే హాతిం కెక్కడాలేని ఆనందమూ - భయమూ ఒకేసారి పుట్టుకుని వచ్చాయి. ఆ గారడీ తాలూకు అసలు రహస్యం తెలిసినందు కొక వైపు అతనికి సంతోషం కలిగినా, చిలుక చెప్పినట్టు ఆ మూడు బాణాలతోనూ చిలుకను చంపలేక పోయినట్టయితే తను కూడా ఆ చలవరాతి బొమ్మల మోస్తరుగా పడి వుండవలసి వస్తుందేమో నని బెంగ కూడా మరొక వంక పట్టుకుంది. అయినా అన్నిటికీ ఆ పరమేశ్వరుడే వున్నాడని ధైర్యం తెచ్చుకుని, ఆ విల్లు తీసుకుని చేత్తో పట్టుకున్నాడు.

హాతిం మొదటి బాణాన్ని ఆ గారడీ చిలు





కను గురిపెట్టి కొట్టాడు. ఆ చిలుక పంజరం లోపల నక్కి కూర్చుందిగా! — అందుకని బాణం తగల లేదు. దాంతో హాతిం వళ్ళు మోకాళ్ల వరకూ అప్పుడే చలువరాతిగా మారి పోయింది. అతను కొంచెం తటపటాయిం చాడు. అయినా తలపెట్టిన పని సగంలో వదిలివేయడం వీరుల లక్షణం కాదు. అందు కని మనస్సు గట్టి చేసుకుని రెండవ బాణం కూడా గురిపెట్టి వదిలాడు. అది కూడా తప్పి పోయింది. పాపం హాతిం నడుం దాకా యీ సారి రాయిగా మారిపోయాడు.

ఇంతవరకూ నేను చేసిన పరోపకారానికి పుణ్యమంటూ వుంటే, దాని బలంతో యీ పరీ క్షలో భగవంతుడు నాకు జయం కలిగించాలి" అని మనసులో భక్తితో భగవంతుణ్ని ప్రార్థిం



చుకుని హాతిం మూడవ బాణం కూడా గురి చూసి పెట్టాడు. ఆ బాణం చిలుక పొట్టకు సరిగ్గా తగిలి రెండు ముక్కలు చేసింది. చిలుక చచ్చిపోయింది. దాంతో పెద్ద పిడుగు పడినంత చప్పుడైంది. అష్ట దిక్కులూ దద్ద రిల్లి పోయాయి ఎటు చూసినా చీకటి పడి పోయింది. వెలుగు లేనే లేదు హాతిం అది చూసి గాబరా పడ్డాడు.

మరి కొంతసేపటి కల్లా పరిస్థితి చక్క బడింది. హాతిం నాలుగు వైపులకూ తేరిపార చూశాడు అక్కడ యిదివరకున్న ఇంద్ర జాలపు గృహం యిపుడు లేదు. మాయమయి పోయింది. చిలుక తాలూకు మృత దేహమూ, దాని ప్రక్కను అమూల్య రత్నమూ మాత్రం క్రిందను పడి వున్నాయి.

హాతిం ఆ రత్నాన్ని అందుకుని దాన్ని అక్కడున్న చలువరాతి బొమ్మ లన్నిటికీ తగి లించాడు. దాంతో మరు క్షణంలో ఆ బొమ్మ లన్నీ మనుషులుగా మారిపోయాయి. వా రంతా హాతిం తమకు చేసిన వుపకారానికి కృతజ్ఞత చెప్పుకుంటూ, అతనికి సాష్టాంగ ప్రణామం చేశారు. వారంతా హాతిం వెంటే అక్కణ్ణుంచి బయలు దేరారు

హాతిం విలాస పురాని కొచ్చి అక్కడి రాజు గారికి జరిగిన సంగతంతా వివరంగా చెప్పాడు. రాజుగా రది విని ఎంతో ఆనం దించారు. ఆయన చేసిన గౌరవ మర్యాదలకు హాతిం చాలా మెచ్చుకుని "మహారాజా, మీ

సహాయం, సలహా మూలంగానే ఇంతటి మహా కార్యాన్ని నేను సాధించుకుని రాగలిగాను. మీరుచేసిన యీవుపకారానికి బదులుగా అక్కడ నాకు లభించిన యీ అమూల్య రత్నాన్ని మీకు బహూకరించాలనుకుంటున్నాను. అయితే దాన్ని ముందుగా షహాబాదులోవున్న హుస్నబానుకి చూపించి తర్వాత మీ దగ్గరకు పంపించుకుంటాను తర్వాత నాకొక కోరిక వుంది. అక్కడ ఇంతవరకూ రాతి ప్రతిమలుగా వున్న యీ జనమంతా నా బంధుమిత్రులు వీరికి మరొక ఆశ్రయు మేదీ లేదు. అందుకని మీరు వీరికి మీ రాజ్యంలో నీడ ఇచ్చి కాపాడాలి. అదే నా కోరిక" అంటూ వేడుకున్నాడు.



"ఓ. అదెంత పని!" అంటూ విలాసపురం రాజు అందుకు సంతోషపూర్వకంగా అంగీకరించాడు.

అక్కణ్నుంచి హాతిం తిన్నగా షహాబాదు కొచ్చాడు తన నేస్తం మునీర్‌షాని వెంట బెట్టుకుని హుస్నభానుకి జరిగిన వృత్తాంతం యావత్తూ చెప్పాడు హమామబాద్ పర్వతంలో దొరికిన అమూల్య రత్నాన్ని చూపించాడు. దాన్ని అందుకుని హుస్నభాను అపరిమితానందం పొంది, ఆమె రాజ మర్యాదలతో హాతింని గౌరవించి,- "మహానుభావా, ఎన్నెన్నో కష్టాలకు గురియైనా నే నడిగిన ఏడు ప్రశ్నలకూ సరియైన సమాధానాలు కనుక్కుని వచ్చారు. కాబట్టి ఈ క్షణం నుంచి నేను మీరెలా నడుచుకోమంటే అలా నడుచుకోవడానికి సిద్ధంగావున్నాను." అని చేతులు జోడించి నమస్కరిస్తూ చెప్పింది.

అప్పుడు హాతిం, - "అమ్మాయీ హుస్నభానూ, నే నెవరి కోసం ఇన్ని కష్టాలు పడ్డానే నీకు తెలుసుగా!—అందుకని ఆ నేస్తం మునీర్‌షానే పెళ్లాడి సుఖంగా వుండు. అదే నాకు పదివేలు" అన్నాడు.

అందుకు హుస్నభాను ఆనందపూర్వకంగా అంగీకరించింది. పురోహితుణ్ని వెంటనే రప్పించి పెండ్లికి మంచి ముహూర్తం నిశ్చయించారు. ఆ నాడు మునీర్‌షాకి, హుస్నభానుకి యెంతో వైభవంగా కల్యాణం జరిగింది. నూతన దంపతు లిద్దరూ హాతిం కాళ్లపై బడి మొక్కి తమ కృతజ్ఞతను తెలుపుకున్నారు. హాతిం నెల రోజుల పాటు అక్కడ

వుండి, తర్వాత వారి వద్ద సెలవు పుచ్చుకుని అక్కడ్నుంచి తన దేశానికి పయనమయి వెళ్లి పోయాడు. అంతే గాకుండా హమామ బాద్ పర్వతంలో తనకు దొరికిన రత్నాన్ని మరచిపోకుండా విలాసపురం రాజుగారికిచ్చి రమ్మని భటుల్ని పంపించాడు. హాతిం ఎమెన్ దేశానికి చేరుకోగానే ఆ దేశపు ప్రజలు తమ ఇళ్లూ - వూళ్లూ సింగారించుకుని కోటి కోటి వైభోగాలతో, వెలుగులతో హాతింకి స్వాగతం చెప్పారు. మహారాజూ - మహారాణీ యెంతో కాలానికి కంటబడిన తమ కొడుకు హాతింని చూసి పరమానంద పడ్డారు. ఇక వారికి కూడా ముసలి కాలం వచ్చింది గదా! అందుకని మంచి ముహూర్తం చూసి వారు కొడుక్కి పట్టాభిషేకం చేసి, ఆ ప్రదేశానికి రాజును గావించారు. అప్పుడు హాతిం తన నేస్తం పనుల పైని వెళ్లినప్పుడు పెళ్లి చేసుకున్న ఎలుగుబంటి రాకుమారి మొదలైన కన్య లందర్నీ రప్పించుకుని శాస్త్రోక్తంగా వారిని పెళ్లాడి తన అంతఃపురంలో వుంచుకున్నాడు. పేద సాద లందరికీ గొప్ప గొప్ప దాన ధర్మాలు చేశాడు. తన ప్రజల్ని కన్న బిడ్డల్లాగ చూసుకుంటూ హాతిం ఆదర్శ రాజుగా రెండు వందల సంవత్సరాలు పరిపాలించాడు.

హాతిం మరణించి కొన్ని వేల సంవత్సరాలై పోయినా, అతను గావించిన సాహస కార్యాలూ, పరోపకారమూ చిరస్థాయిగా ప్రపంచంలో నిలిచి పోయాయి అందుకే మనిషి మరణించినా అతను చేసే మంచి పని మాత్రం లోకంలో శాశ్వతంగా నిలిచి పోతుందంటారు మన పెద్దలు. కాబట్టి మనం కూడా మంచి మనసుతో మంచి మంచి పనులు చేసి హాతిం లాగునే గొప్పపేరు సంపాదించుకోవాలి తెలిసిందా?—

[సమాప్తం]

